

ముఖచిత్ర కారుడు

**అనిబల్ కరసి** (1560 - 1609)

అనిబల్ కరసి అత్యంత అద్భుతమైన సృజనాత్మక శక్తిగల ఇటలీ కళాకారుడు. నాటి ఇటలీ చిత్రకళలో 'కృత్రిమత్వం' బాగా చోటుచేసుకొంది. దీనితో విసిగిన ఆయన తన సోదరునితో కలిసి, తను జన్మించిన బొలొగ్నలో, ఒక అకాడెమీని స్థాపించాడు. ఇక్కడ కళాభ్యాసం చేసిన వారంతా ఆ 'కృత్రిమత' నుంచి బయటపడ్డారు. వారి కృషి ఫలించింది.

ముప్పై ఐదవయేట బొలొగ్నను వదిలి రోమ్ వెళ్ళాడు. అక్కడ ఫార్నేస్ ప్రదర్శనశాలను జలవర్ణాలతో చిత్రించాడు. మైకలాంజెలో, రాఫెల్‌ల ముఖ్యచిత్రాల తరవాత ఈ గాలరీ చిత్రీకరణకు అంతపేరూ వచ్చింది. వాడి, వేడి ఉన్నవాడు. బహుళ ప్రచారాన్ని పొందినవాడు. కళాకారులందరికీ అంతో ఇంతో ఉండే 'ఉన్నత్తావేశం' ఈయునకూ ఉంది. జీవిత చరమాంకంలో అవసాదంతో బాధపడ్డాడు.

## ముఖచిత్రం గురించి

ఈ చిత్రం ఆ మధ్య 1965లోనే దొరికింది. అయితే అంతకు ముందు నుంచే ఇది మనకు చెక్కడాలలో దర్శన మిస్తూనే ఉంది. ''వీనస్ - అడొనిస్'' గాథను కవులు గాయకులు కీర్తించారు. షేక్స్పియరు కూడా దీనిని వదల లేదు.

మన్మథుని శరాఘాతం తిన్న ప్రేమ దేవత వీనస్, అడొనిస్ సౌందర్యానికి మరులుగొని నిస్పృహాయంగా దాసోహం అంది.

ఆ తరవాత అడొనిస్ వేటలో మరణించాడు.

# మిసిమి

**"All that we are is the product of what we have thought" is "We are what we think." — Dammapada.**

సంపుటి 8 సెప్టెంబర్ 1996 సంచిక 8

వ్యవస్థాపక సంపాదకుడు : డాక్టర్ **రవీంద్రనాథ్ ఆలపాటి**

## విషయసూచిక



ముఖచిత్రం : **''వీనస్ - అడోనిస్''**

విడిప్రతి రూ. 6/- వార్షిక చందా రూ. 70/-

Printed, Published by BAPANNA ALAPATI at Kala Jyothi Process Ltd., 1-1-60/5, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 7612436, 7612337.

సంపాదకుడు : అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి

# Watch out for who and whom

- Willam Safire

Trust is hot. Even the most contrarian pundit agrees that this presidential election will be decided on which candidate is most trusted by voters. At an April 15 rally outside Philadelphia, Bob Dole put it this way: "If something happened along the route and you had to leave your children with Bob Dole or Bill Clinton, I think you'd probably leave your children with Bob Dole... It all boils down to, who do you trust"

In his riposte, Bill Clinton told a dinner of White House correspondents in May: "Let's say that you were going on vacation for a couple of weeks - who do you trust to water your plants - Bob Dole or Bill Clinton?... You go home tonight, and you decide to order a pizza - who do you trust to select the toppings?" Because the non - partisan rigour of this language column is a wonder to behold, no position is here taken on the puissance of the original Dole thrust or the quality of dersion in the Clinton counterthrust. This is my biennial (that is every second year; biannual is twice a year) item about the persnickety who\whom.

Is it who do you trust or whom do you trust?

That is easy: because who is nominative and whom is objective, and the sentence parses as you\trust\the object, then it should be you\trust him, or whom, not he or who. Thus the correct question would be "Whom do you trust?"

Say wha'? that's the sort of advice you get from a person whose icy secretary says: "Whom should I say is calling>" We are faced here with what grammarians as renowned as Henry Fowler and Otto Jespersen discussed as "the hypercorrect whom." Whom has its place in current usage. As the object of a preposition, whom not only is right but also feels right, as in "For Whom the Bell Tolls." Similarly "To Whom it May Concern" is natural; "To Who" would be anathema to a native speaker. Whom also feels right in "the one whom we feared," not "the one who we fear" (unless more is added "He is the one who we feared would win the election").

But at the beginning of a sentence, whom comes across as an affectation.

In politics, formality went out with neckties, and what is comfortable to the listener's ear is to be preferred in address. Whoever the coming election favours will begin his sentences with who - despite the correctness of Whomever in that instance - and he will thank whomever he wants for pointing this out. Therefore, the time has come to pro vide a corollary to Safire's Law, which is "Whenever whom is correct, recast the sentence." The corollary is "Who begins a sentence with whom will never be elected president of anything." (In that sentence, who is nominative, or substantive, or subjective - pick one; they all mean the same - and is right in its own right, not just because it comes at the beginning.)

Who do you trust? On this, trust me, than whom there is none more contemptuous of pondering.

# ఆంధ్రుల సంస్కృతీ వికాసంలో ఆచారాల అడ్డుగోడలు - సంస్కరణోద్యమాలు

**- డా. రావి భారతి**

సమాజ సాంస్కృతిక జీవనంలో ఆచారాలు ప్రముఖమైన పాత్ర వహిస్తాయి. అసలు ఆచారమంటే ఏమిటి? సాంఘిక శాస్త్రజ్ఞు డు ఎమ్‌గిన్స్ బర్గ్ ప్రకారం ''ఒక సంఘంలోని సభ్యుల్లో సాంప్రదాయకంగా నెలకొన్న ప్రామాణికమైన ప్రవర్తనా పద్ధతి. వాస్తవంలో ఆచారమనేది కేవలం వ్యాప్తిలో ఉన్న అలవాటే కాదు, ఒక చర్యకు సంబంధించిన నియమం కానీ, నిబంధన కానీ ఔతుంది.''

ఈ ఆచారాలకు మూలమేది? అన్న అంశాన్ని గురించి చాలా మంది పాశ్చాత్య విద్వాంసులు చర్చించారు. ఫ్రాయిడ్ ప్రకారంగా ''నిషేధమే ఆచారానికి కారణం. ఇది మానవజాతి యొక్క ప్రాచీన అలిఖిత ధర్మ శాస్త్రం. దీన్ని ధిక్కరిస్తే ఆపదల పాలౌతామన్న భయమే ఆచారాల కొనసాగింపుకు కారణమౌతుంది.'' ఈ సిద్ధాంతంతో చాలా మంది ఏకీభవించారు.

ఇకపోతే ఆచారాలు అలవాట్ల యొక్క స్వరూప స్వభావాల గురించి కొందరు సాంఘిక శాస్త్రవేత్తలు, మేధావులు, విమర్శకులు చెప్పిన అంశాల్ని క్రోడీకరిస్తే ఇలా చెప్పుకోవచ్చు:

1. వ్యక్తి పరంగా ఒక పనిని ప్రతినిత్యం చేస్తే అది అలవాటు. అదే ఒక జాతి పరంగానో సంఘపరంగానో చేస్తే ఆచారమౌతుంది. అలవాట్లు వ్యక్తికీ వ్యక్తికీ మధ్యన భేదించవచ్చు. ఆచారాలు అలా కాకుండా దేశానికి జాతికీ మొత్తంగా చెందుతాయి.

2. ఏవైతే సమిష్టి శ్రేయోదాయకంగా ఉంటాయో, ఏవైతే సంఘ పురోభివృద్ధికి తోడ్పడతాయో అవే ఆచారాలుగా పరిగణింప బడతాయి. వాటికే పవిత్రత ఆపాదింప బడుతుంది.

3. ఈ ఆచారాలు యుగ యుగాంతరాల నుండి అనేక మంది మహాత్ముల వల్ల మానవునికి అయాచితంగా సంక్రమించిన ఐశ్వర్యం.

4. ఒక దేశానికి గానీ, ఒక వర్గానికి గాన్ని, సహజమైన ఆచారం మరొక దేశానికిగానీ, వర్గానికీగానీ విడ్డూరంగా కనిపించవచ్చు. ప్రపంచ వ్యాప్తంగా మనం ఎన్నో ఉదాహరణల్ని పరిశీలించవచ్చు.

5. ఒక సజీవ సాంప్రదాయం మన అంతరంగ శక్తుల్ని ప్రభావితం చేసి మన స్వభావాల్ని సుకుమారంగా మార్చి మనల్ని ఉన్నత స్థాయికి చేరుస్తుంది. తద్వారా జాతిని వికసింపజేస్తుంది.

6. ఆచారం వేరు. సాంప్రదాయం వేరు. విశ్వాసం వేరు. ఆచారం ప్రధానంగా ఆచరణకు సంబంధించింది. సంప్రదాయం ఆలోచనకు సంబంధించింది. విశ్వాసం మతానికి సంబంధించింది.

ఈ ఆచారాలు ఒక జాతి జీవన విధానాన్ని ప్రతిబింబిస్తూ నైతిక పతనం నుండి కొంతవరకు కాపాడవచ్చునేమో కాని జాతి యొక్క ఆర్థిక సాంఘిక విప్లవంలో ఏమాత్రం పాలుపంచుకోలేవు.

ఈ విధంగా సిద్ధాంత రీత్యా ఆచారాలు సాంస్కృతిక జీవనంలో ప్రధాన పాత్ర వహించినా ఆచరణలో అవిక్రమంగా తమ అంతశ్శక్తిని కోల్పోయి దుష్ఫలితాలకు దారితీశాయి. ఉదాహరణకు స్వామి వివేకానందుడు అప్పటి సామాజిక పరిస్థితులకు అనుగుణంగా బాల్య వివాహాల్ని సమర్థించాడు. ఎందుకవి అవసరమో కారణాలు కూడా ఇచ్చాడు. అయితే కాలాంతరంలో అవి కన్యాశుల్కం బాలవితంతువులు లాంటి దురాచారాలకు దారితీసాయి. అలాగే వితంతు వివాహాల్ని నిషేధించాలన్నాడు. అయితే ఈ నిషేధం అవి నీతికీ, సాంఘిక ఆర్థిక అభద్రతకూ దారితీసింది.

అలాగే వివాహంలో ఒక వధువు యొక్క ఆర్థిక భద్రతకోసం వుద్దేశించిన ఆభరణాలు, స్థిర చరాస్తులు కాలక్రమంలో వరకట్నాలుగా మారి కాలసర్పాలై వధువుల్ని కాటేస్తున్నాయి.

మరికొన్ని ఆచారాలు దురాచారాలు కాకపోయినా అర్థరహితాలుగా మిగిలి పోయాయి. ఉదాహరణకు నల్లగొండ జిల్లాలో కొన్ని ప్రాంతాల్లో సత్యనారాయణ వ్రత సందర్భంలో వ్రత ప్రారంభానికి ముందు ఒక పిల్లిని బట్ట క్రింద కమ్మడం ఆచారం. అది తరాలుగా కొనసాగుతున్నది. ఎప్పుడో వారి తాత ముత్తాతల కాలంలో వ్రత సందర్భంలో ఒక పిల్లి ప్రసాదాన్ని అపవిత్రం చేసింది. వాళ్లు దాన్ని పట్టి బుట్ట కింద కమ్మారు. దాన్ని ఒక ఆచారమనుకొని తరువాతి తరం వాళ్లు కూడా వ్రత సందర్భంలో అక్కడ పిల్లి లేక పోయినా సరే పట్టితెచ్చి దాన్ని కమ్మడం ప్రారంభించారు. లేకపోతే అదొక అపచారం! ఈ విధంగా ఒక ఆచారాన్ని ఏ ప్రయోజనం కోసం పాటిస్తున్నాము అన్న స్పృహలేకుండా యాంత్రికంగా కొనసాగించడానికి ఎన్నయినా ఉదాహరణల్ని చెప్పొచ్చు.

గతంలోని కొన్ని సదాచారాలు అసలు తుడిచిపెట్టు కొని పోతున్నాయి. కొన్ని ప్రాంతాల్లో వివాహితయైన స్త్రీకి పుట్టింటి వారు అయిదు సంవత్సరాలకొకసారి ''ఒడి బియ్యం'' పొయ్యడం ఒక ఆచారం. ఒడిలోని బియ్యం పునరుత్పత్తి శక్తికి ప్రతీక. అంతేకాదు ఆ ఆచారం పుట్టింటితో సంబంధం బాంధవ్యాలు అవిచ్ఛిన్నంగా కొనసాగడానికి సహకరిస్తుంది. అయితే ఈ యాంత్రిక యుగంలో, సమిష్టి కుటుంబ విచ్ఛిన్న దశలో ఈ ఆచారం క్రమంగా కనుమరుగౌతున్నది. ఇలా ఎన్నో ఉదాహరణలు చెప్పొచ్చు.

మతాచారాలు కూడా అర్థరహితంగానో, అనాచారంగానో, దురాచారంగానో మారుతూ ఉండడం మనకు తెలుసు. అడుగడుగునా వర్జ్యాలు చూడడం, పంచాంగాలు పఠించడం, పిల్లి ఎదురొచ్చినా, వితంతువు ఎదురుపడినా, అత్యవసరమైన పనినైనా వాయిదా వెయ్యడం అనారోగ్యానికి వైద్యుల్ని సంప్రదించ కుండా అమ్మలను బాబాలను ఆశ్రయించడం, పరిశుభ్రతకు చిహ్నంగా ఉండవలసిన మడి ఆచారాలు మానవత్వాన్నే కించపరచడం, వీటన్నిటికీ జీవితంలో ఒకశాస్త్రీయ అవగాహన లోపించడమే కారణం అని మనం ఖచ్చితంగా చెప్పొచ్చు.

ఇలా కొన్ని ఆచారాలు దురాచాలుగా పరిణమించిన క్రమంలో ఆంధ్రుల పరివర్తన దిశను సంస్కరణోద్యమ దశగా అర్థం చేసుకొని ఆయా కాలాల్లోని ఉద్యమాలు దురాచారాలను

సంఘం నుండి ఎంతవరకు దూరం చేయగలిగాయి, ఆంధ్రుల సామాజిక పరివర్తనలో ఎంత వరకు పాలు పంచుకోగలిగాయి అన్న ప్రశ్నలకు ఈవ్యాసం సమాధానంగా ఉండగలదని భావిస్తున్నాను.

రెండు వందల సంవత్సరాల విదేశీపాలన ఫలితంగా ప్రజల్లో జాతీయ చైతన్యం అంతరించింది. ఆత్మవిశ్వాసం అడుగంటింది. అన్ని రంగాలలో ఆనాడు నిస్తబ్దత, కుళ్లు, క్రియాశీల రాహిత్యం రాజ్యమేలాయి. అతి బాల్య వివాహాలు తత్ఫలితంగా ఏర్పడే బాల వితంతువులు, సహగమనాలు, వరశుల్క కన్యాశుల్క దురాచారాలు, మూఢ నమ్మకాలు మత మౌఢ్యాలు వంటి సాంఘిక మత దురాచాలు సమాజంలో వేళ్లు పాతుకొనిపోయాయి. వాటిని నిజానికి 19వ శతాబ్దంలో భారతీయుల్లో స్వాతంత్ర్య వాంఛ అంకురించక ముందే వారిలో సాంప్రదాయిక సమాజాన్ని సంస్కరించాలన్న కోరిక బయలుదేరింది. ఆ తరువాత 19వ శతాబ్ది ఉత్తరార్థంలో క్రమంగా జాతీయోద్యమం బలాన్ని పుంజుకున్నది. దాదాపు 1890 నుంచి ఇటు సంస్కరణోద్యమం, అటు స్వాతంత్రోద్యమం ఈ రెండు కూడా సమాంతరంగా సాగుతూ వచ్చాయి.

ఆత్మ విమర్శ పట్ల ఉత్సాహం విప్లవాత్మకమైన మార్పుల్ని ప్రవేశపెట్టవలె న్న వాంఛ - ఇవి బెంగాల్‌లో 19 శతాబ్ది ఆరంభంలోనే బయలు దేరాయి. రామ్ మోహన్‌రాయ్ తల పెట్టిన మత, సంఘ సంస్కరణ కార్యక్రమాలు వీటికి దోహదం చేశాయి. భారతీయ సాంస్కృతికోద్యమంలో బహ్మ సమాజం పాత్ర మరువరానిది. ఆంధ్ర దేశంలో కూడా బ్రహ్మ సమాజం గణనీయమైన పాత్ర వహించింది. ఈ ఉద్యమ సంస్కృతి నుంచి భావ జాలం నుంచి ఎన్నో అత్యుత్తమ వ్యక్తిత్వాలు వెలుగులోకి వచ్చాయి. పాశ్చాత్య విద్యా విధానం, ఆపైన ఆంగ్ల భాషా సాహిత్య ప్రభావం చేత మధ్య తరగతి మేధావు లెందరో ఆనాడు బయలుదేరారు. వాళ్లు బౌద్ధిక స్వాతంత్ర్యానికీ సామాజిక చలన శీలతకు ప్రతినిధులుగా ఉండి కొత్త భావాలకు వాహికలైనారు. సంఘ సంస్కరణోద్యమాలకు అవసరమైన దృక్పథాన్ని, సామాజిక పునాదిని సమకూర్చిపెట్టారు. కందుకూరు, సామినేని ముద్దు నరసింహం, ఏనుగుల వీరాస్వామి, గురజాడ, రఘుపతి వేంకట రత్నం, చిలక మర్తి మున్నగువారు ఆకోవకు చెందుతారు.

అయితే వలస పాలన కాలంలో చేపట్టబడిన '' ఆధునికీకరణ'' ఏవిధంగా పరిమితులకు లోబడిందో, అదే విధంగా ఉన్నత కులాలకు చెందిన మధ్య తరగతి మేథావి వర్గం చేపట్టిన సంఘ సంస్కరణ, సాహిత్యోద్యమాలు కూడా కొంత అసంపూర్ణంగా ఉండి పోయాయి అంటారు విమర్శకులు.

ఈ సంస్కరణోద్యమాలు సమాజ ఉపరితలంలోని కొన్ని పరిమితమైన అంశాలను స్పృశించాయే తప్ప మౌలిక సమస్యల్ని చేపట్టలేక పోయాయి అని కూడా విమర్శకు లంటారు. వాటికెన్నో కారణాలున్నాయి.

1. తర తరాలుగా సమాజంలో పాతుకొని పోయిన దురాచారాలు, అలవాట్లు దూరం కావడం అంత సులభం కాదు. పాత సాంప్రదాయాల స్థానంలో కొత్త భావాలను ప్రజలు అంత సులభంగా అంగీకరించరు. కనుక అగ్రకులాల ప్రతి ఘటనను సంస్కర్తలు ఎదుర్కొనక తప్పలేదు.

2. ఈ సంస్కరణోద్యమం ఆనాడు సామాజిక ఉపరితలంలో కులీన సమాజానికి పరిమితమైంది తప్ప అట్టడుగు సామాన్యుడిదాకా చేరలేదు.

3. హిందూ మత పునాదిని దెబ్బ తీయకుండా అతి సున్నితంగా సాగిన ఈ ఉద్యమం రాను రాను దాని అంతశ్శక్తిని కోలుపోయింది. నాయకులలో ఉన్న త్యాగనిరతి అనుయాయుల్లో కరువైంది. సామ్రాజ్య వాద వ్యతిరేక స్వభావం అందులో లేకపోవడం వల్ల తిరిగి హిందూ పునరుద్ధరణ వాదం ఈ ఉద్యమాన్ని మింగడానికి ప్రయత్నం చేసింది.

4. పాశ్చాత్యీకరణ భారతీయుల్లో తమ సాంప్రదాయిక సమాజాన్ని మార్పు చేయాలనే కోరికను రేకెత్తించినా, దాని కంటే కూడా అత్యవసరమైన, అతిశక్తి వంతమైన పారతంత్ర్య విముక్తి భావన నాయకుల్లోనూ, ప్రజల్లోనూ కేంద్రీకృతం కావడంతో సామాజిక పరివర్తన కోరిక కొంత గౌణ స్థాయికి దిగజారింది.

పంతులుగారు వారి అనుయాయులు ఇన్ని ప్రతికూల పరిస్థితుల్లో కూడా తమ ప్రహసనాల ద్వారా నవలల ద్వారా పత్రికల ద్వారా, ఇతర రచనల ద్వారా, ఉపన్యాసాల ద్వారా మధ్య తరగతి కుటుంబాలను దురాచారాల నుండి దూరం చేయడానికి నడుం కట్టి కొంతవరకు సఫలీకృతులైనారు. సాంఘిక దురాచార నిర్మూలనోద్యమం ఆనాడు సాహిత్య రంగంలో మొదటిసారిగా ప్రారంభమైందన్న అంశం గమనార్హం.

సంఘ సంస్కర్తల కృషి వల్ల బాల్య వివాహాలు కన్యాశుల్కం యొక్క ఉధృతం కొంత వరకు తగ్గింది కాని రాయప్రోలు కాలానికి కది వర శుల్కంగా అవతారమెత్తి ఇప్పటికీ అది మనల్ని పట్టిపీడిస్తూనే ఉన్నది. ఆనాడు వరకట్న పిశాచానికి బలైపోయిన ఎంతో మంది యువతుల ఆత్మఘోషకు '' స్నేహలత లేఖ'' ఒక అక్షర రూపం. 1835 మార్చి 21వ తేదీన కలకత్తాలోని 'సమాచార దర్పణ' మనే పత్రికలో ఒక స్త్రీ తల్లిదండ్రుల్ని, సహోదరుల్ని, సమాజాన్ని ఉద్దేశించి ప్రశ్నల రూపంలో ప్రకటించిన ఒక లేఖ స్నేహలత లేఖకు ప్రేరణయేమో అన్న అనుమానం కలగడానికి వీలుకలిగిస్తున్నది. ఆ లేఖ స్పష్టంగా ఆనాటి లింగ వివక్షకు, స్త్రీపురుష ద్వంద్వ నీతి విధానానికి అద్దం పడుతుంది. ఆలేఖలోని ఆరు ప్రశ్నల్లో నాల్గవ ప్రశ్నకు కవితా రూపమే స్నేహలత లేఖ.

విశేషమేమంటే సంఘ సంస్కరణోద్యమాన్ని ప్రారంభించి కొనసాగించిన విద్యాధికులు కానీ, ఆ ఉద్యమాన్ని తమ రచనల్లో ప్రతిబింబించిన కవులు కాని ఇతర సమస్యల కంటె స్త్రీజనోద్ధరణ పట్ల మరింత శ్రద్ధ వహించినట్లు కనబడుతుంది. గురజాడలోనూ, రాయప్రోలులోనూ స్త్రీలే చాలా వరకు నాయికలుగా కనిపిస్తారు. దీనికి కారణమేమిటి? ఇటు సంస్కర్తల్లోనూ, అటు కవుల్లోనూ అధిక సంఖ్యాకులు బ్రాహ్మణాది అగ్రవర్ణాలకు చెందిన వారుగా ఉండడం, స్త్రీల సమస్యలు చాలా వరకు అగ్ర వర్ణ స్త్రీలకు సంబంధించినవి కావడం ప్రత్యక్ష మూలాన సమస్యలకు ప్రతి స్పందించిన కవులు వాటిని తమ రచనల్లో అచ్చొంతించారు. రాయ ప్రోలుకూడా ఎంతగా అమలిన శృంగార భావనకు అంకితమైపోయినా, తన కుటుంబంలో, తన బంధు వర్గంలో, తన చుట్టూరా ఉన్న సమాజంలో స్త్రీకి జరుగుతున్న అన్యాయాల నుంచి, తన్నిర్మూలనకై బయలుదేరిన సంస్కరణోద్యమాల ప్రభావం నుంచి తప్పించుకో లేకపోయాడు.

19 వశాబ్దపు చివరి దశలో ప్రారంభమైన ఉద్యమాలు ఆంధ్రదేశ సమాజంపైన తమ ప్రభావాన్ని మరింత చూపాయి. విద్యా వంతులైన మేధావి వర్గం హేతువాద, మానవతా వాద, వ్యక్తి వాద దృక్పథవు వెలుగులో సమాజంలోని మూఢ విశ్వాసాలనూ, మత మౌఢ్యాలనూ, పరిశీలించింది. సంస్కరణ చేపట్టడానికి సంఘాలను స్థాపించడమే కాకుండా సనాతన మూఢ సంస్కృతిని ఖండించడానికి ప్రజల్లో హేతువాదం, శాస్త్రీయ అవగాహన పెంపొందించడానికి రచనలు చేపట్టింది. ఈ భావ జాలం యొక్క అవగాహనను సులభతరం చెయ్యడానికి గురజాడ, గిడుగులు ప్రవేశపెట్టిన వ్యావహారిక భాష ఒక గొప్ప సాధనమయింది.

ప్రతి తరమూ తనకు కావలసిన నాయకత్వాన్ని తానే సృష్టించు కుంటుంది. అలాంటి నాయకుడు రామస్వామి చౌదరిగారు. అగ్రవర్ణాల ఆధిపత్యాన్ని ప్రశ్నించి అమానుషమైన విధానాలను తొలిసారిగా ఆంధ్ర దేశంలో బద్దలు కొట్టిన వారు చౌదరిగారు.

వీరి కాలం నాటికి వివాహ వ్యవస్థ పురుషునికి అనుకూలంగా మారుతూ వచ్చింది. ఒక పురుషుడు అనేక మంది స్త్రీలను భార్యలుగా చేసుకోవచ్చు కాని స్త్రీ మాత్రం ఏక భర్తృ కగానే ఉండాలి. కనుకనే కవిరాజు ''వివాహమనేది ఔరసత్వమునకు గౌరవ స్థానమిచ్చుటకై ఏర్పడినట్లు తోచకమానదు'' అన్నారు. చౌదతిగారు వివాహ రంగంలో గొప్ప సంస్కరణను ప్రవేశపెట్టారు. సంస్కృతమంత్రాలను తేటతెలుగు మాటల్లోకి మార్చివేశారు. వధూవరులు ఆచరించవలసిన విధులను సులభతరమైన తెలుగులో ప్రవచించారు. వారేస్వయంగా నడుంకట్టి అనేక వివాహాలు చేయించారు. చౌదరిగారి ''వివాహవిధి'' అన్న చిన్న పుస్తకం సమాజంలో పెద్ద పరివర్తనను తెచ్చింది. కరుడుకట్టి ఘనీభవించిపోయిన సంఘంలో చైతన్యాన్ని కలిగించింది. హేతువాద, అభ్యుదయ భావాలకు నిలయమైన కుటుంబాల్లో బ్రాహ్మణ పౌరోహిత్యం లేకుండా ఆనాడు వందలాది వివాహాలు జరిగాయి. అభ్యుదయ, హేతువాదులు ఇప్పటికీ దీన్ని పాటిస్తున్నా ఒక అయిదు శాతం మాత్రమే అని చెప్పకతప్పదు.

ఏ ప్రాంత సంస్కృతీ ప్రవాహమైనా స్థూలంగా రెండు పాయలుగా ప్రవహిస్తుంది. ఒకటి కులీన సంపన్న వర్గాలకు చెందిన సంస్కృతి. రెండు జనబాహుళ్యానికి సంబంధించింది. సరిగ్గా 20వ శతాబ్ద ప్రథమ భాగంలో తెలంగాణా ప్రాంతంలో నిజాంనిరంకుశ ప్రభుత్వం యొక్క నీలినీడలు ఈ రెండు పాయలపై ప్రసరించాయి.

ఆ రోజుల్లో జాగీర్దారీ, జమీందారీ, దేశ్‌ముఖ్, దేశ్‌పాండే భూస్వామ్య కుటుంబాల్లో పరదా పద్ధతి అమలులో ఉండేది. ఆనాటి ఫ్యూడల్ కుటుంబ స్త్రీల శరీరాలకే కాదు వ్యక్తిత్వాలకు కూడా బురఖా వేయబడింది. ఎక్కడికైనా వెళ్ల వలసివస్తే పరదాలతో మూసిన కచ్చడం బండ్లలో గానీ, మేనాలలో గానీ ప్రయాణం చెయ్యాలి. ఇళ్లలో ఆడవాళ్లు గట్టిగా మాట్లాడకూడదు. బావగార్లకు మామగార్లకు కనుపించ కూడదు. భోజనం వడ్డించ వలసివస్తే కోడళ్లు పరదాచాటునుంచి అందిస్తే, అత్తగారుగానీ, సేవకులుగాని వడ్డిస్తారు. బాల్యవివాహాలు విపరీతంగా

జరిగేవి. ఆడపిల్లలు చిన్నతనంలోనే అత్తవారింటికి వెళ్ళి సమిష్టి కుటుంబంలో అత్త మామలకు సేవచేస్తూ తోడికోడళ్లతో సహజీవనం చేస్తూ వ్రతాలు చేస్తూ, నోములునోస్తూ బ్రతకడమే జీవిత పరమార్థంగా భావించడం జరుగుతుండేది.

కొంత విద్యాధికులైన ప్రజలు కూడా భావ దాస్యానికీ భాషా దాస్యానికీ బానిసలై బ్రతికారు. మహమ్మదీయ సంస్కృతిపై మోజుపెంచుకున్నారు. దేశ్‌ముఖ్‌లు, జాగీర్దార్లు మొదలైన విద్యాధికులు కూడా తుర్కీటోపీలు, షేర్వాణీలు, పైజామాల ముసుగులో తెలుగుదనాన్ని దాచడానికి ప్రయత్నించారు. ఉరుదూలోనే మాట్లాడుతూ పాందాన్, ఒగల్‌దాన్, దస్తర్‌ఖాన్, ఖలన్‌దాన్ సంస్కృతిని ఇళ్లలోని దిగుమతి చేసుకున్నారు. ఇప్పటికీ కొన్ని సంపన్న కుటుంబాల్లో, రెడ్డి వెలమ కరణాల కుటుంబాల్లో సభ్యులు పరస్పరం ఉరుదూలోనే మాట్లాడుకుంటారంటే ఆ సంస్కృతి యొక్క ప్రభావం ఎంత ఉందో మనమర్థం చేసుకోవచ్చు. తెలంగాణా వైతాళికులైన మాడపాటిహనుమంత రావుగారు, సురవరం ప్రతాపరెడ్డిగారు మున్నగువారు ఒకవైపు ఆంధ్రోద్యమ, ఆంధ్రమహాసభల ద్వారా, మరోవైపు తమరచనల ద్వారా ప్రజల్లో, స్త్రీలలో జాగృతిని కలిగించడానికి కృషిచేశారు.

ఇకపోతే ఆనాటి వ్యవస్థలో సామాన్య స్త్రీ పురుషుల పరిస్థితి మరింత దుర్భరంగా ఉండేది. లంచగొండితనం, వెట్టిచాకిరీ అక్రమవసూళ్లు వంటి ఆర్థిక దురాచారాలు అమలులో ఉండేవి. దొరల ఇళ్లలో పనిచేసే స్త్రీ, పురుషులకు చాలీ చాలని బిచ్చాలు, మామూళ్ల పేరిట కొంత ధాన్యం ముట్టజెప్పినా వాళ్లు అర్థాకలితో పస్తులుండవలసి వచ్చేది.

స్త్రీలు పురుషులు పిల్లలు అనే తేడాలేకుండా జమీందార్లు స్వంత ఆస్తిగా వాళ్లను పరిగణించేవాళ్లు. ఆ వ్యవస్థలో పురుషుల కంటే స్త్రీలు రెట్టింపుబాధలు అనుభవించారంటే సత్య దూరంకాదు. ఆనాటి ఆడపాపల ఆచారం తెలంగాణా సాంఘిక చరిత్రకే మాయని మచ్చలాంటిది. ఫ్యూడల్ దోపిడీలో కెల్లా అతిదారుణమైనది భూస్వాములు తమ కుమార్తెలను అత్తవారింటికి పంపేటప్పుడు ఆడపాపల్ని బహూకరించి అత్త వారిండ్లలో పనిపాటలకోసం, అవసరమైతే దొరల అవసరాలు తీర్చడానికి పంపడం జరుగుతూ ఉండేది.

ఒకవైపు ఈ ఆర్థిక సాంఘిక దురాచారాలకు వ్యతిరేకంగా, మరోవైపు నిజాం నిరంకుశత్వానికి వ్యతిరేకంగా ప్రజలే ఉద్యమించి విజయం సాధించిన ఘట్టం తెలంగాణా చరిత్రలోనే అపూర్వమైన ఘట్టం. ఈ తెలంగాణా ఆర్థిక సాంస్కృతిక పోరాటం ఉపరితలం నుంచి కాక అట్టడుగు నుండి ప్రారంభమైంది కనుకనే అచిరకాలంలోనే సత్ఫలితాలను సాధించింది.

ఆధునికాంధ్రయుగ లక్షణాలలో ఉద్యోగరీత్యా, వ్యాపారాలరీత్యా ఆంధ్రులు విదేశాలకు వలస వెళ్లడమొకటి. వలసాంధ్రుల్లో మన ఆచారాలు అలవాట్లు ఎంతగా నరనరాన జీర్ణించుకొని పోయివున్నాయంటే అంతర్జాతీయ జీవనసరళిలో ఒక భాగంగా బ్రతుకుతున్నప్పటికీ, వాళ్ల ప్రత్యేకతను లోకానికి చాటుతూనే ఉన్నారు. అమెరికాలో ''తానా'', ''ఆటా'', మారిషస్‌లో

ఆంధ్రమహాసభవంటి భాషా సాంస్కృతికసంస్థల ద్వారా తమ ఆంధ్రవ్యక్తిత్వాన్ని నిలుపుకుంటూనే ఉన్నారు.

మనకు భాష సంస్కృతిలో ఒకభాగం. మారిషస్ ఆంధ్రులకు భాషే సంస్కృతి. భాషే ఆచారం. వారిలో, కుల స్పృహలేదు. వాళ్లనుండి ఈ విషయంలో నేర్చుకోవలసింది చాలా ఉంది. వాళ్లదొకటే కులం ''తెలుగు కులం''.

మారిషస్ ఆంధ్రులుకాని, అమెరికా ఆంధ్రులుకాని వాళ్లరుచులు, అభిరుచులు మారకుండా జాగ్రత్త పడడమే కాదు, ఉగాది, దసరాలాంటి పండుగల్లో కట్టూబొట్టూలో సాంప్రదాయిక పద్ధతిననుసరిస్తూ అందరూ కలసి వేడుకలు జరుపుకుంటారు.

దురదృష్టకరమైన అంశమేమిటంటే డాలర్ల మోజులో మనసాంకేతిక పరిజ్ఞానం, శాస్త్రవిజ్ఞానం, మేధా సంపత్తి వ్యక్తులతో పాటు విమానమెక్కుతున్నది. వివాహాలు జరుగుతున్నది వ్యక్తులకు కాదు వీసాలకు!

అమెరికా ఆంధ్రులు బాగా కష్టపడి పనిచేస్తారు. డాలర్లు బాగా సంపాదిస్తారు. తెలుగు భాషను, తెలుగు ఆచారాలను శక్తి మేరకు నిలుపుకునే ప్రయత్నం చేస్తున్నారు. అయితే వాళ్ల ముందొక పెద్ద ప్రశ్న ఈనాడు నిలిచి ఉన్నది. అదేమిటంటే తమతరువాతి యువతరం ఈ సంస్కృతిని, ఆచారాలను ఇలా కొనసాగిస్తుందా అన్న ఆలోచనలో అమెరికా తలిదండ్రులు కొట్టుమిట్టాడుతున్నారు. మిశ్రమసంస్కృతి సృష్టించే అయోమయపు విషవలయంలో చిక్కుకొని పాశ్చాత్య సంస్కృతికి బలైపోతారేమోనన్న భయం వారిని పట్టి పీడిస్తున్నది. స్వార్థం ప్రవేశించనంతవరకు సదాచారాలెప్పుడూ కనుమరుగైపోవు. సదాచారాల్లో సత్తా ఉంటే ఒకరు కాపాడవలసిన పని లేదు వాటికవే కాపాడుకుంటాయి.

## ఆధార గ్రంథాలు


1. కవిరాజు త్రిపురనేని రామస్వామ చౌదరి జీవితం సాహిత్యం - త్రిపురనేని సుబ్బారావు
2. తెలుగు కాల్పనిక వాద సాహిత్యం - స్థానీయత జాతీయత (వ్యాసం) ఎ. సత్యనారాయణ , కె. చక్రపాణి.
3. భారత మహిళ - శ్రీ వివేకానందుడు
4. తెలుగు జానపద సాహిత్యం - డా. వసుంధరాదేవి.
5. మారిషస్ ఆంధ్రులు. - డా॥ యన్. గోపి.


★ ★ ★

మధురవాణి మాటకచేరి

# చూడ చూడ రుచుల జాడ లివెయె

– సత్తెనపల్లి రామమోహన్ రావు

ఏ పాటు పడినా సాపాటుకే- అంటూ వుండేది మా అమ్మ. చదువూ సంధ్యా ఆట్టేలేని బోళామనిషి కాబట్టి మా అమ్మ అలాఅంటుది కాని అదే కాస్తచదువుకున్నవారయితే ఇంకాస్త గంభీరంగా - ఉదర నిమిత్తం బహుకృతవేషం- అని ఉండేవారు. అనివుండేవారేమిటి వెనకటి పండితులు అలా అన్నారు కూడా. ఆమాటా నిజమే మరి - పొట్టకోసమే కదా ఎన్ని తిప్పలు పడ్డా? లేకపోతే నేను యిక్కడ రామచంద్రపురం అగ్రహారంలో పంతులుగారి అడాలో వుండటమేమిటి- అక్కడ పట్నంలో మా అమ్మ నేను పంపేడబ్బుల కోసం ఎదురుచూస్తూ దిక్కులేని దాన్లా ఒక్కతే వుండడమేమిటి? - అన్నగత ప్రాణులం కాబట్టి అన్నం చుట్టేపరిభ్రమిస్తూ వుంటాయి మన బ్రతుకులన్నీ. ఆ మాటకొస్తే ప్రాణంవున్న జీవాలన్నీ తిండికోసం వెంపర్లాడేవి కావా? అయితే పశువులు, పక్షులు, క్రిమికీటకాదులన్నీ ఏదో దొరికింది తిని కడుపు నింపుకుంటాయి. కాని మనిషు లట్లాకాదు. కొత్త రచులను కోరుకుంటారు. అందుకే వేమన - ''అన్నము తినువేళ నాత్మ రుచుల గోరు నదియు నాల్కజెప్పు నడుగుచుండు - '' అన్నాడు. అందాకా ఎందుకు గిరీశం కూడా ఆమాటే అంటాడు. వేదాల్లోను పురాణాల్లోను కూడా భోజనాన్ని గురించిన భోగట్టాయే వుందిట. ''యేవందోయ్ నీ ఉపనిషత్తు? అన్నం బ్రహ్మేతి వ్యజానాత్ అన్నవే బ్రహ్మఅని తెలుసుకోవోయి వెధవాయా అంది'' అంటూ దబాయిస్తాడు.

అంతేకాదు ''తెల్లవాడు రోజూ ఫాదర్ గివ్ అజ్ అవర్ డెయిలీ బ్రెడ్ అనగా నన్ను కన్న తండ్రీ రోజూ ఒక రొట్టెముక్క ఇయ్యవోయి అని ధ్యానం చేస్తాడుట. ఇహ మనం తండ్రీ రోజూ కందిపప్పు ధప్పళం యియ్యవయ్యా అని ధ్యానం చేయాలట. అంతేకాదు మన చమకంలో శ్యామాకాశ్చమే-చామల అన్నం మామజాగా వుంటుంది మాక్కావాలి దేవుడా అన్నాడు. ఆ చమకంలో యెవడికి యిష్టమైన వస్తువులు వాడు కలపవచ్చును - కంది గుండాచమే యింగువ చారూ చమే - అంటూ. దీనినే రిలిజియస్ రిఫార్మ్ అంటారు''- అంటూ శలవిస్తారు గిరీశం పండితులవారు. ఈ మాటలు వింటూ అందిస్తే అల్లుకుపోయే వెంకటేశం - 'గేదె పెరుగూ చమే చేగోడీ చమే -'' అంటూ చమక పారాయణంలో తన క్ష్టిమైన వస్తువులు కూడా చేరుస్తాడు. ఇవన్నీ వింటుంటే ఏ పురాణంలోనయినా భోజన ప్రకరణం వుండకపోదనిపిస్తోంది.

ఉదరానందమే హృదయానందాన్ని కలిగిస్తుందేమో నని పిస్తుంది ఒక్కోసారి. ఈ కిటుకు తెలుసుకోవటం వల్లనే నేమో ఆ గడుసుపిల్ల - ''గుత్తి వంకాయ కూరోయ్ బావా కోరి వండినానోయ్, కూర లోపల నావలపంతా కూరి పెట్టినానోయ్ -'' అని చెలికాణ్ణి కవ్విస్తుంది. అసలు అందాలను తినుబండారాలతో పోల్చటం కూడా మన వారికి మొదటినుంచి వున్న అలవాటే. బూరెల్లాంటి బుగ్గ లంటారు. దొండపండు పెదిమలంటారు. ఈ కిటుకులు తెలుసుకున్నది కాబట్టే కొనకళ్ళ వారి కోడలు పిల్ల- ''అందముగా తీపందుకునేలా అరిసెలు నోటికి అందిస్తానో, వారిస్తూ చవులూరిస్తూ నా బుగ్గలె రుచి అని బులిపిస్తానో'' -అని బంగారుమామను ఆటపట్టిస్తూనే - ''మాపటివేళా విందుకు రావోయి మతకరి మామయ్యా..'' అంటూ మామను ఆహ్వానిస్తుంది. బుగ్గల బూరెలతో, అధరాల అరిసెలతో ఇహ ఆ విందు ఎంత పసందుగా వుంటుందో వేరే చెప్పాలా?

మన కవులంతా-పూర్వులేమిటి ఆధునిక లేమిటి అంతా కూడా. ఎప్పుడో ఒకప్పుడు తినుబండారాల మీద కవిత్వాలు గుప్పించినవారే - చిలకమర్తివారయితే పకోడీల మీద కూడా పద్యాలు రాశారు. '' ఆ కమ్మదనము నారుచి యా కరకర యా ఘుమఘుమ యా పొంకములా రాకలు పోకలు వడుపులు నీకే దగు నెందులేవు నిజము పకోడీ'' అంటూ ఆ కవిగారు రాసిన పకోడీ పద్యాలు వేడివేడి పకోడీలున్నంత రుచిగాను వుంటాయి.

''పేరొందిన తాజ్‌మహల్ పెసరట్ల పులావుకంటె నెక్కువది కాదు. కన్నుల నిండుకంటె కడుపునిండే ఘనమని పాశ్చాత్యులు బ్రహ్మసూత్ర నిర్మాణము చేసినారు. రవివర్మ రాయబారపు సభామండప మంతయు మా కామిగాడు చేసిన కందబచ్చలికాడ క్షూరకు సాటిరాదు-'' అంటూ మహోప న్యాసం యిస్తాడు సాక్షి శాస్త్రులు గారు. ఏకళలయినా పాకకళ తర్వాతివేనని యీాయన అభిప్రాయం. వండటమే కాక భోజనం చేయడం కూడా ఒక కళే అనేవాళ్ళు కూడా వున్నారు. ''ఉండడం కాదమ్మా ప్రధానం తినాలి, తినడమూ కాదు ఏది ఏమిటో ఎందుకో తెలియాలి -'' అంటుంది శ్రీపాదవారు సృష్టించిన ఓ పాత్ర. ఈవిడ దృష్టిలో మినపసున్నిలో బంగారు తీగల బెల్లమే పడాలి.'' పంచదార వేశేవు సుమా పాడయిపోతుంది-'' అంటుంది. రుచుల విషయంలో కొంతమంది యింత పట్టుదలగాను వుంటారు.

అసలు రుచుల దగ్గర కొచ్చే సరికి ముఖ్యంగా చెప్పుకోవలసింది శ్రీనాథుణ్ణి గురించే. ఆ కవిసార్వభౌముడు శృంగార ప్రియుడే కాదు భోజన ప్రియుడు కూడా. ''తొలుతనే వడ్డింత్రు దొడ్డ మిర్యపు జారు చెవులలో పొగవెళ్ళి చిమ్మిరేగ - '' అనే యీాకవికి తమిళులు భోజనంలో ముందుగానే సాంబారు వడ్డించే పద్ధతి నచ్చదు. తెలుగింటి ఊరగాయలు, పచ్చళ్ళు, ఆవపెట్టిన కూరలు ఆరగించే అలవాటుకల కవిగారికి అరవల చప్పిడి భోజనం ఏం నచ్చుతుంది? అందుకే- ''అరవ వారింటి విందెల్ల నాగడంబు -'' అంటూ విసుక్కుంటాడు. ఆమాట కొస్తే యీాయనకు పల్నాటి వారి జొన్న వంటకాలూ నచ్చలేదు. కన్నడ వారి ఇంగువ వంటలూ ఇంపని పించలేదు. ''జొన్న కలి జొన్న యంబలి, జొన్నన్నము జొన్న పిసరు జొన్నలె తప్పన్ సన్నన్నము సున్న సుమీ-'' అనేది పల్నాటి సీమ మీద కవి సార్వభౌముని ఫిర్యాదు ఇహ విజయనగరం వెళ్ళిన సందర్భంలో కన్నడవారి తెలికపిండి వంటకాలు వెల్లుల్లి దట్టించిన కూరలూ తినలేక కళ్ళు తేలేస్తాడు -''వెల్లుల్లిన్ దిలపిష్టమున్ మెసవితిన్‌విశ్వస్త వడ్డింపగా జల్లా యంబలి ద్రావితిన్ రుచులు దోసంబంచు బోనాడితిన్-'' అంటూ బాధపడుతాడు. పూర్వకవులందరిలోకి అధికంగా దేశసంచారం చేసిన కీర్తి శ్రీనాధునిదే. వెళ్ళిన చోటల్లా తన శృంగార ప్రియత్వంతో పాటు భోజన ప్రియత్వాన్ని కూడా దాచుకోకుండానే వ్యవహరించాడు. ఈ కవి వర్ణించినన్ని వంటకాలను మరే కవి వర్ణించలేదంటే అత్యుక్తి కాదు. పలనాటి వీర చరిత్రలో, శృంగారనైషధంలో, హరవిలాసంలో శ్రీనాధకవి రాసిన ఏ కావ్యమయినా, పిండివంటల, పరమాన్నాల చిత్రాన్నాల ఘుమ ఘుమలతో గుబాళించి పోయిందే. శాకాహార ఫలహారాలతోనే సరిపెట్టుకోకుండా మాంసాహార రుచులను కూడా పాఠకులకు పంచిపెట్టాడు. పలనాటి వీరచరిత్రలో మృగాల మాంసంతో చేసే అనేక వంటకాలను గురించి వర్ణించి పాఠకుల నోళ్ళూరించాడు. హరవిలాసంలో కూడా మాంసపు వంటకాలు వండే వైనాల్ని వివరించాడు. ''మిరియము నుల్లియన్ బసుపు మెంతియు నింగువ జీరకంబు శర్కరయును జింతపండును గరాంబువు గమ్మనినేయి తైలంబున్ పెరుగును మేళవించి కడు బెక్కు విధంబుల పాకశుద్ధి వండిరి మాంసమున్-'' అంటూ మాంసపు వంటకాల

సొగసును కూడా వర్ణించాడీ కవి. అంతేకాదు పుల్లపెరుగు రుచి, ఆవపచ్చళ్ళ చవి కూడా యీ కవి పద్యాలు చదివి తెలుసుకోవలసిందే. శ్రీనాథుడు రసికుడే కాదు భోజన రసికుడు కూడా.

కాస్త అటూ యిటూగా గిరీశం కూడా అంతటివాడే. కాశీ మిఠాయీ కావాలంటాడు, చల్దివణ్ణం తినటానికీ - ''నాట్‌ది స్లైటేస్ట్ అబ్జక్షన్'' అంటాడు. అంతేకాదు పులు సటుకులూ చిట్టి గారెలు కూడా పసందుగా తయారు చేయగలడు- ''దీపం ముందు కూర్చొని పుస్తకం తిరగేస్తూ పులుసటుకులు ధ్యానం చెయ్యి. ఇంగువ వేసి బలే సొగసుగా తయారు చేస్తాను-'' అంటూ వెంకటేశాన్ని ఊరిస్తాడు. గిరీశం తను చేసిన పులు సటుకులు ఒకసారి నాకు కూడా రుచి చూపించాడు. ఆయన మాటల్లానే కమ్మగా వున్నాయి. కబుర్లు కమ్మగా చెప్పేవాళ్ళు చేసే వంటకాలు కూడా కమ్మగానే వుంటాయేమో.

''వంకాయ వంటి కూరయు పంకజ ముఖి గౌరివంటి భార్యామణియున్ శంకరుని వంటి దైవము -'' ధాత్రిలో లేరన్నాడో కవి. ఈయనకు వంకాయ కూరంటే మహా ఇష్టమని వేరే చెప్పాలా? అయితే చౌడప్ప కవికి మాత్రం కాకరకాయ కూర అంటేనే ఇష్టం. ''వేయారు వగల కూరలు గాయ లనే కములు ధాత్రిని గల వందులలో నాయకములురా కాకరకాయలు'' అంటూ యీయన కాకరకాయల మీద పద్యాలు రాశాడు. అందుకేనేమో కవి చౌడప్ప పద్యాలు కాకరకాయల్లా చిరు చేదుగానే వుంటాయి.

ఇల్లు చూసి ఇల్లాల్ని చూడమన్నారు. అలాగే వాసనలను బట్టి వంటల రుచిని తెలుసుకోవచ్చు. ''మీ ఊళ్ళో పోపుపెడితే మా ఊళ్ళో ఘుమ ఘుమ లాడుతుంది-'' అంటాడు ఓ పెద్దమనిషి మల్లాది రామకృష్ణ శాస్త్రిగారి ''కృష్ణాతీరం'' నవలలో. అసలు శాస్త్రిగారు రుచుల విషయంలో సర్దారే అని చెప్పవచ్చు. లేకపోతే -'' ఇదిగో చుట్టాలొచ్చారని నవకాయ పిండివంటలూ చేసేవ్. వంకాయ నాలుగు పచ్చాలు చేసి పోపులోవేసి, ఆనపకాయ మీద యింత నువ్వు పప్పు చల్లి, అరటి దూట మొఖాన యింత ఆవెట్టి, తోటకూర కాడల్లో యింత పిండీ బెల్లం పారెయ్. కొబ్బరీ మామిడి అల్లం యీ పచ్చళ్లు చాల్లే. పెరుగులో తిరగబోత పెట్టి దాన్లో పది గారెముక్కలు పడెయ్. రవంత శనగపిండి కలిపి మిరపకాయలు ముంచి చమురులో వెయ్. సరే క్షీరాన్నమంటావా అదోవంటా? ములక్కాయలు మరి కాసిని వేసి పులుసుపాయి మీద పడెయ్ - యీ పూటకు యిల్లా లఘువుగానే పోనిద్దాం -'' అని సంభాషణను సాగదీయ గలడూ? - వంటల వాళ్ళకే వంట నేర్పేంత చమత్కారం తాండవిస్తుంది యీయన రచనల్లో. అచ్చ తెలుగు వంటకాలను గురించి తెలుసుకోవాలంటే శాస్త్రిగారు సృష్టించిన అన్నప్పగారిని అడగాల్సిందే. అసలు అన్నప్పగారి మాటలే నేతి తాలింపుల గుబాళింపులు.

అన్నప్పగారు తెలుగువారి శాకపాకాలన్నిటిని గురించి చెప్పినా ఎందుకో అసలయిన, ఆంధ్రుల అతిప్రియమైన గోంగూరను గురించే ఎక్కడా ప్రస్తావించలేదు. అందులోను కృష్ణలంకలలో దొరికే పుల్ల గోంగూర లోకప్రసిద్ధి చెందినా. ఆలోటును గువ్వల చెన్నుడు తీర్చేశాడు- ''వెల్లుల్లి పెట్టి పొగిచిన పుల్లని గోంగూర రుచిని పొగడగ వశమా -'' అంటూ మొదలు పెట్టి- 'మొల్లముగ నూనె వేసుక కొల్లగ భుజియింప వలయు గువ్వల చెన్నా'' అంటూ దీర్ఘాలు తీశాడు. తెలుగు వాళ్ళందరికీ గోంగూర యిష్టమైన పదార్థమే. కాబట్టే గోంగూర పాటలు, గోంగూర పద్యాలు కొల్లలుగా పుట్టుకొచ్చాయి.

మగమహారాజులే వంటలూ పిండివంటలు గురించి పద్యాలు రాసి కవిత్వాలు అల్లగా లేంది ఆడవాళ్ళ పాటలలో తిండిగొడవ వుండడంలో అబ్బురమే ముంటుంది. అందుకే పానుగంటి వారి ''కంఠాభరణం'' నాటకంలో సుబ్బలక్ష్మి - ''అప్పడాల్ వడియాలు గోవిందారామ ఆకులందుంచిరి గోవిందా, పప్పులు పచ్చడులు గోవిందారామ పళ్ళెములందుంచిరి గోవిందా-'' అంటూ గోవిందనామాలలో కూడా వంటల స్మరణే చేస్తుంది. శ్రీకృష్ణుని చల్దులు, సీతమ్మ సీమంతం - వంటి స్త్రీల పాటలలో ఎన్ని రుచికరమైన పదార్థాలను వర్ణించారో తలుచుకుంటేనే నోరూరిపోతుంది. ఏ కవిత్వమయినా పొట్టనిండిన తర్వాతే కదా పై కుబికేది. అందుకే కాబోలు మన కవులు కవిత్వంలో వంటల మసాళాలు బాగానే దట్టించారు.

మా పూటకూళ్ళమ్మ కూడా ఏ కూరయినా రుచిగానే వండగలదు. కాని వండదు. కావాలనే ఏ ఉప్పో ఎక్కువ వేస్తుంది. దాంతో అర్ధశేరు అన్నం తినేవాడు పావుశేరుతోనే సరిపెట్టుకుంటాడు. అందుకేగా అన్నారు - ఆశ గలమ్మ దోషమెరుగదు పూటకూళ్ళమ్మ పుణ్యమెరగదు - అని. ఏమిటో అన్నం దగ్గర కూర్చుంటే ఎక్కడెక్కడి తిండి విషయాలు జ్ఞాపకం వస్తున్నాయి. అదిగో పంతులు వచ్చినట్లున్నాడు. తలుపులు బాదుతున్నాడు. ''వచ్చె వచ్చె - అన్నం తింటున్నాను - ఇదిగో చెయ్యి కడుక్కొని వచ్చేస్తున్నాను. - అట్టై బాదక ఆగండి!.''

## THE AMAZING AND BAFFLING POWER OF WORDS

**- BY M.R. SETHI**

" What do you read my lord?,' Polonious asks Hamlet, in Shakespeare's play of that name, and the prince replies, "Words, words, words." This quiz takes you on the trail of words, words, words....

1. The motorist honked and honked but the man on the road did not hear as he was 'zonked'. Can you guess the condition of the pedestrian?
2. You have have heard of puppies and mummies. But can you tell who are 'yuppies' and 'yummies'?
3. Here is a poser to young men of marriageable age. Would you curse or praise your stars, if your wife turned out to be a 'xanthippe'?
4. Will you get an accolade if all you said is 'gasconade'?
5. Bimetallism is not a branch of science dealing with metals. What is it?
6. You have heard of hatchet. But can you tell what is cachet?
7. You would be a very holy person, if you had a 'gloriole. Can you guess what would be your distinctive mark?
8. A Farmer is protecting his field from trespassers when he is hedging. What is a trader doing when he is 'hedging'?
9. The Americans were dazed when the Japanese 'Kamikazed'. What does the word 'Kamikaze' mean?
10. Oeuvre is not a short from of manoeuvre. What does the word 'oeuvre' mean?

**See ANSWERS on Pg. 305**

# గిరీశం గారిది ''బొట్లే రింగ్లీ''షా?

– భరాగో

"How beautiful! Quite unexpected!!"

బుచ్చెమ్మ కనబడిన క్షణంలో గిరీశం విభ్రమలో పడి ''అనుకున్న'' మాటలు, అవి. బుచ్చెమ్మ అందాన్నిచూసి అతను ''ఎంత అందంగా ఉంది!'' అనో, '' ఆహా, ఏమి యందము!'' అనో తెలుగులో ఆశ్చర్యపడలేదు. ఆ Spur of the moment లో అతను ఇంగ్లీషులో ఆశ్చర్యపడ్డాడు. క్రమంగా విభ్రమ నుంచి బైటపడి, ''యేమి చక్కదనం. యీసొంపు యక్కడా చూళ్లేదే!' అనుకున్నాడు.

గురజాడ అప్పారావుగారికి వాడుక (తెలుగు) భాష ఎంత ''కొట్టిన పిండో'' గిరీశానికి వాడుక ( ఇంగ్లీషు) భాష అంత; అని చెప్పుకోవచ్చును. వినేవాడికి ఏమాత్రం ఇంగ్లీషు పరిజ్ఞానం ఉన్నా ( ఉందని అతను అనుకున్నా) గిరీశం తన మాటల్లో కొంచెం ఇంగ్లీషు ప్రయోగించక మానడు.

Idiotic English కాదు, Idiomatic English.

గిరీశం '' ఏం'' చదువుకున్నాడో మనకి తెలియదు. కాని, Royal Reader, Manual Grammar, Ghosh' Geometry, Basu Algebra, Srinivasa Iyer Arithmetic, Shepherd General English, Venkata Subba Rao Made Easy -ఈ పుస్తకాల్లో ఉండే పదార్థాన్ని వెంకటేశానికి బోధించే ఉద్దేశం (సామర్థ్యం) ఉన్నట్టు తెలియ జెయ్యగల వాడు (Kuppuswamy Iyer Made difficult అనే ప్రయోగం "Made Easy"ని అపహాస్యం చెయ్యాలని చేసిందే కాని అలాంటి పుస్తకం ఉండదనుకుంటాను."Made Easy"అనేది ఈ కాలం నాటి 'గైడ్'' గా భావించవచ్చు. "Made difficult"అనగానే గైడ్ల ఉపయోగం ఏ మాత్రమో చెప్పినట్టు అయింది కదా).

అప్పారావుగారు గిరీశం ఇంగ్లీషు పరిజ్ఞానాన్ని ఓపక్క హైలైట్ చేస్తూనే మరోచేత్తో ఆ ప్రకృతిని హాస్య స్ఫోరకం చేసుకుని, గిరీశానిది శ్రుతపాండిత్యమా, అనుశ్రుత పాండిత్యమా అనే మీమాంసలో పడేశారు మనల్ని.

When lovely Woman Stoops to folly
And finds too late that men betray
What charms can soothe her melancholy
What arts can Wash her guilt away?

Oh, Whistle to me and I will come away
Though father mother and grandmother
Should go mad

Can love be contrlloed by advice,
Will Cupid our mothers obey?
It is Women that seduce all mankind

అని Quote చేయ్యగల గిరీశం అగ్నిహోత్రావధానులు చూపించిన కోర్టుకాగితాలలో వున్న ఇంగ్లీషు follow అవలేక ''ఎవడో తెలివి తక్కువ గుమస్తా రాసినట్టుంది. అక్షరం పొలితే లేదండి'' అన్నాడు. ''మావకీలు గడగడ చదివేసే డండి'' అని అగ్నిహోత్రావధానులంటే, ''ఇది అరిటిపండు ఒప్పినట్టు తర్జుమా చేసి దాఖలు చేస్తా'' ననేశాడు.

మనస్సు కొంచెం కులాసాగా వుంటే (కొంతమందికి) పాట ఏదైనా పాడుకోవాలనిపిస్తుంది. గిరీశం యిలాంటి కులాసా సమయంలో పాడేపాటలో కొంత ఇంగ్లీషుంది; చూడండి:

నీ Sight నా delight
నిన్ను మిన్న కానకున్న
Quite Wretched Plight
Moon లేని Night!

Full moon bright టా
Jasmine white టా
Moon కన్న మొల్ల కన్న
నీదు మోము Bright టా!

ఇలా (అర్థవంతంగానే) పాడుకో గలిగిన గిరీశమే, అగ్నిహోత్రావధాన్లింట నలుగు రెదురు గానూ వెంకటేశంతో జరిపిన సంభాషణ ద్వారా తనకి ఇంగ్లీషు అసలు మనసుకి పట్టిన పదార్థం కాదన్నట్టు స్ఫురింపజేసేడు.

అప్పారావుగారు దీనిని ఆనాటి ప్రజలలో కానవస్తున్న ఆంగ్ల విద్యాభ్యాసాభిమానాన్ని ఎద్దేవా చేసి ఎండ గట్టడానికి వాడుకున్నారు.

అగ్నిహోత్రావ ధాన్లు గారి ఇంటి గుమ్మం ముందర గిరీశం Soliloquy లో కొన్ని ప్రయోగాలు పరిణతీ నిదర్శనాలు న్నాయి.

''దీనికి love signals రామ రామ; ఏమీ తెలియవు''.

" I am dreadfully in love with her... దీన్ని చూసిన దగ్గిర్నించీ Town loves, dancing girls మీద పరమా సహ్యం పుట్టింది. Positive abhorence; అంతా insincereity!"

"Two birds at one shot. (ఇది) utterly innocent widow. పరమ పవిత్రమైన Widow with gilt letters."

"To marry a Widow or not to marry; That is the question"

""Let us see. Imprimis - ... ... Negative Advantage... Having nothing to do with a pauper world; Positive Advantage ... Possessing all its wealth.

'' ఏదైనా Asses' Bridge కట్టాలి.'

Ground prepare అయింది. కనక – Let me begin the Campaign at once.

ఈ Soligoquy లో గిరీశం ఆలోచనల్లో దొర్లిన ఇంగ్లీషు మాటలు మనకి హాస్యం ఇచ్చే ఆనందాన్ని కలగజేస్తాయి. అయితే, ఆమాటలు ఆడినది, వాడినది ఎవడో అరకొరజ్ఞానం కలిగిన వాడు కాక; ఆరువేల మైళ్ల దూరాన పుట్టిన ఆ అన్యభాషయందు మంచి అదుపు కలవాడుగా మనకు గోచరిస్తాడు. ఇందులో "Gilt Letters" లాంటి ప్రయోగాలు తెలుగులో ఆలోచించి ఇంగ్లీషులో వ్యక్త పరచినవి కావచ్చు. కాని over all గా ఈ English Idiomatic English అనడానికి Not the slightest objection!

వెంకటేశానికి పాఠం చెబుతూ One thing at a time అని, that will not do అని, that

is right అని, perfectly right అని అనగలడు గిరీశం, అగ్నిహోత్రావధాన్లు వినే సమయంలో " My dear boy, God made creation. Father is next to God" అని చెప్పి; ''మొత్తం మీద ఈ ఇంగ్లీషు చదువు మంచిదిలాగే కనబడుచున్నది. భాష భేదం గాని; మన ముక్కలే, వాళ్లవీనీ!'' అని Cretificate పొందగలడు.

''మీ ఇంట్లోనే ఓ unfortunate beautiful young widow ఉందటోయ్? My heart melts ... ..మాంచి యర్రగా బుర్రగా వున్న young widow ని నువ్వు పెళ్లాడకపోతే I should be ashamed of you" అన్నాడు గిరీశం; వెంకటేశంతో. ఇందులో Heart melts అనేది తెలుగులోంచి ఇంగ్లీషుకు వెళ్లిన ప్రయోగం.

గిరీశం బుచ్చెమ్మతో Love at first sight లో పడ్డాడు. అలాగే, కరటకశాస్త్రి, గిరీశం పరస్పరం చేసుకున్న "Assessment at first meet" కూడా చాలా గొప్పది. ''తర్ఫీదు మాచక్కగా వుంది. వీణ్ణి పెందరాడే తోవపెట్టకపోతే మోసం వస్తుంది'' అని కరటక శాస్త్రి అనుకుంటే; గిరీశం (వెంకటేశంతో; మీ Uncle) కరటకశాస్త్రి scoundrel లా కనపడుతున్నాడు - అన్నాడు. దొంగను పట్టుటకు దొంగయే కావలెను. కాని అతన్ని గురించి చెప్పవలసి వచ్చినప్పుడు ఉపయోగించే మాట సరిగ్గా వెతికి పట్టుకున్నాడన్నమాట. అలాంటి కరటక శాస్త్రి ఎదురుగా ఏమి చెప్పినా Throwing pearls before swine అవుతుందని గిరీశం అనుకున్నాడు.

Lectures ఎంతసేపూ Cities లోనేగాని పల్లెటూళ్లలో ఎంత మాత్రమూ పనికి రావని, పల్లెటూరి People Lecturers కి unfit అనీ పూనా లాంటి Cities లో Lecture యిస్తే Ten thousand People వినడానికి వస్తారనీ గిరీశం చెప్పేడు. Opinions అప్పుడప్పుడు Change చేస్తేనే గాని Politician కానేరడు - అనే అఖండమైన సత్యం చెప్పింది కూడా గిరీశమే. ఈ చెప్పడం కూడానూ, ''అభిప్రాయాలు అప్పుడప్పుడు మార్చుకుంటుంటే తప్ప రాజకీయ వాది కాలేడు.'' అంటూ తెలుగులో చెప్పలేదు. తనకు వచ్చిన ఇంగ్లీషులో సరైన మాటని సరైన చోట వాడగలగడమే గిరీశం గొప్పతనం.

Never do by halves
Make hay while the sun shines
This is barbarous.
Such a man is to be pitied
I beg your pardon
I crave your mercy
I turned altogether a new leaf
True repentence కి 24 hours చాలదా?

ఇవన్నీ గిరీశం మాటలు. ఇతను వేశ్యని "My dear Empress!" అని సంబోధించగలడు. "Civilization కెల్లా నిగ్గు Widow marriage" అనీ, Infant marriages లేక పోతే Widows పుష్కలంగా తయారవరు గనక, అప్పుడు Widow marriages కి అవకాశం వుండదు కనుక; a Infant marriages కూడుననే (రైటేనని) తోస్తోంది'' అని సిద్ధాంతం చెయ్యగలడు. Widow marriage మీద, Nautch question మీద గంటలు గంటలు Lectures యివ్వగలనన్న ఆత్మవిశ్వాసం కలవాడు. ''పూనా Deccan College లో The eleven causes for the de-generation of India గురించి మూడు గంటలు ఒక్క బిగిన

Lecture యిచ్చే సరికి ప్రొఫెసర్లంతా డంగయిపోయారు'' అని నమ్మబలక గలడు. గిరీశం యిలాగ లెక్చర్లు యివ్వగలడని మహామహా వాళ్లు నమ్మేరు. అందులో గౌరవనీయులు; కీర్తిశేషులు బళ్లారి రాఘవగారు; ప్రసిద్ధ రచయిత ముళ్లపూడి వెంకట రమణగారు ఉన్నారు. ''భారతదేశ పతనానికి పదకొండు కారణాలు'' అని బళ్లారి రాఘవగారు పుస్తకం రాసేరు. (Of course: ఆ పుస్తకంలో ఉన్న Matter గిరీశం గారు పూనా Deccan College లో ''యిచ్చిన'' మూడు గంటల Lecture తాలూకు Transcription అయివుండవచ్చును!) ముళ్లపూడి వెంకటరమణ గారు ''గిరీశం లెక్చర్లు'' అని కొన్ని ఉపన్యాస ధోరణి గల వ్యాసాలు రాసి పుస్తకం వేయించారు.

గిరీశం మంచి వాక్శుద్ధి కలిగిన కవి. అతను రాసిన కొన్ని పద్యాలు చిత్తగించండి:-

ఖగపతి అమృతము తేగా
భుగభుగ మని పొంగి చుక్క భూమిని రాలెన్
పొగ చెట్టై జన్మించెను
పొగ త్రాగని వాడు దున్న పోతై పుట్టున్

(''కొంత మంది త్యాగశీలురైన కవులు తాము కవిత్వం చేసినన్నీ అట్టి కవిత్వము తమపేరుల మీదుగా ప్రాచుర్యములోనికి వచ్చునో రాదో యని సందేహించి అతః పూర్వ ప్రఖ్యాతులైన కవుల గ్రంథములలో ప్రక్షిప్తీకరించిన విధాన'', గిరీశంగారు ఈ పద్యం బృహన్నార దీయం నాలుగవ ఆశ్వాసంలో ఉన్నదని చెప్పేరు. కాని; నిజానికి ఇది గిరీశం గారు చెప్పిన పద్యమే.)

మరొకటి:-

నదమా పొక్కిలి, జాంబూ
నదమా మై చాయ, కోక నదమా పదమా
పదమా జడ, నడుము వియత్
పదమా నూగారు గూఢ పదమా చెలికిన్!

తెలుగులో సంగతి సరే; మనం యిప్పుడు చెప్పుకుంటున్నది గిరీశంగారి ఇంగ్లీషు సంగతి కదా - అంటే:-

She leaves her bed at AM Four
And Sweeps the dust from off the floor
And heaps it all behind the door,
The Widow!

భర్త మరణించిన స్త్రీకి తెల్లవారు జాము పొరాలు ఉండవు, అందుచేత ఆమె తెల్లవారు జామున నాలుగ గంటలకే శయ్యను వీడ గలదు. ఇల్లు ఊడ్చడం ఒక ముఖ్యమైన పని. ఇందులో; తలుపులు తెరిచి బైటికి వెళ్లడం అక్కడ లేనిపోని ఆపదలు కొని తెచ్చుకోవడం లాంటి రిస్కులు లేవు. చీపురు పెట్టి ఊడ్చగా వచ్చే దుమ్ముని ఇంచక్కా తలుపు వెనకాల పోగుపెట్టెయ్యొచ్చు.

Of Wond'rous size she makes the cake,
And takes much pains to boil and bake,
And eats it all without mistake,
The Widow!

భర్తను పోగొట్టుకున్న స్త్రీలు రాత్రిపూట ''భోజనం'' చెయ్యకూడదు. ''ఫలహారం'' చెయ్యొచ్చు. ''ఫలహారం'' అంటే ఒకటో రెండో అరిటిపళ్ళు తినేసి పడుకోడం కాదు. బియ్యం, పప్పు ఉపయోగించి ''నూక'' (రవ్వ) తయారుచేసుకుని ''రొట్టె'' చేసుకోవచ్చును. బియ్యపునూక ఒక్కటే మాత్రం ఉపయోగించి ''సొజ్జి'' పోసుకో వచ్చును. బియ్యం రెండు పాళ్లు మినప పప్పు ఒకటి తో రవ్వచేసుకొని దానిని నాలుగు గంటలసేపు (అంత పులుపుగాలేని) మజ్జిగలో నానబెట్టి; తగుమాత్రం అల్లం పచ్చిమిర్చి ముద్ద, కొంచెం ఉప్పుతో; నూనెతో ఉన్న బాణలిలో వేసి సన్నసెగను ఉడక (వేగ) నిచ్చిన '' దిబ్బరొట్టె'' చాలా సర్వసాధారణం. దీని సైజుకూడా నిర్ణీతమే:- ''మురీ ఎత్తు; మూరెడుకైవారం '' దీన్నే గిరీశం గారు "Of wond'rous size - cake" అన్నారు. ''ఫలహారం'' అనగా ''క్లుప్తమైన ఆహారం'' కూడా కాదు; ఈ వండ్రస్ సైజు గల ''దిబ్బరొట్టె''ను Eats it all without mistake అనగా ఇంకెవరికీ పెట్టకుండా తానొక్కతే తింటుందని భావం.

And now and then she takes a mate
And lets the hair grow on her pate
And cares a hang what people prate
The Widow!

భర్తను పోగొట్టుకున్న స్త్రీకి ''పరపతి సదుపాయం'' ఉంటుంది. దానికి గిరీశంగారి అన్నకూతురు మీనాక్షే తార్కాణం. Lets the hair grow on her pate అనగా పరపతి సౌఖ్యం వల్ల సమకూరే హుందాతనం అనే అర్థం చేసుకోవాలి, ''మబ్బు విడిచిన ఎండ'' వలె. ఆ హుందాతో జనం ఏం అనుకుంటే నాకేమని నిబ్బరించ గలది అవుతుంది; ఆమె.

I love the Widow - however she be,
Married again, or single free
Bathing and Praying
Or frisking and Playing
A model of Saintliness,
Or model of Comeliness,
WHAT WERE THE EARTH
BUT FOR HER BIRTH!?

''విడో'' యొక్క ఎత్తు పల్లాలను (అదే –Virtues and Weaknesses ని) కూలంకషంగా పరిశీలించి క్లుప్తంగా చెప్పిన ఈ Poem ని "Reformer" (అనే మేగజైన్) లో అచ్చు వేయించగా Tennyson (అనే బ్రిటిష్ మహాకవి ఆ రోజుల్లో Great Britian మహాసామ్రాజ్యానికి Poet Laureate అనగా ఆస్థానకవి) గుండె బాదుకున్నాడంటే బాదుకోడా, మరి?

ఇలాంటి ఆంగ్ల భాషా ప్రవీణుణ్ణిగురించి ''వాడా? గిరడని మేం పిలిచే వాళ్లం; బొట్లేరింగ్లీషు ముక్కలూ వాడూనూ'' అని తేలికచేసి మాట్లాడిన రామప్పంతుల్ని ఏం చేస్తే పాపం? అని నాకు అని పిస్తుంది. గిరీశం యెప్పుడేనా కనబడి నట్టాయెనా; ''వాట్ మిస్టర్ గిరీశమ్! హవార్యు? యువారె గ్రేట్‌మాన్ వోయ్; అంతెందుకూ; నీకున్న లాంగ్వేజి మీ మేష్టరు కుందీ?'' అని Congratulate చేయ్యాలని కూడా నాకు అనిపిస్తుంది!

గిరీశం సామాన్యుడు కాడు; శంభుప్రసాద్ గారి తెలుగు వెలుగు నెం.75.

# ఆధునిక బౌద్ధుడి మతం

ప్రొఫెసర్ పి. లక్ష్మీనరసు అముద్రిత రచన: — టి. రవిచంద్

ప్రొఫెసర్ పి.లక్ష్మీనరసు 1934 జులై 14వ తేదీన మద్రాసులోని తమ స్వగృహంలో మరణించారు. అప్పటికి ఆయన వయస్సు 74 సంవత్సరాలు. ఆయన మరణించేనాటికి బౌద్ధ ధర్మంపై ఒక పుస్తకం రచించారు. దానిపేరే 'ఆధునిక బౌద్ధుడి మతం' (ది రెలిజియన్ ఆఫ్ ఎ మోడరన్ బుద్దిస్ట్). ఇది వారి చివరి రచన. ప్రొఫెసర్ లక్ష్మీనరసు జీవితం, రచనలు డా॥ అంబేద్కర్‌ను ప్రభావితం చేశాయని ఇప్పుడు ప్రత్యేకంగా చెప్ప నవ సరంలేదు. ప్రొఫెసర్ లక్ష్మీ నరసు రచనలు డా॥ అంబేద్కర్‌ను ఎంతగా ప్రభావితం చేశాయో తెలుసుకోవాలంటే ప్రొఫెసర్ లక్ష్మీనరసు ఆంగ్లంలో రచించిన '' ఎ స్సెన్స్ ఆఫ్ బుద్దిజం'' (బౌద్ధధర్మ సారం) గ్రంథం మూడవ ముద్రణకు డా॥ అంబేద్కర్ 1948 లో రాసిన పీఠికే తార్కాణం. ప్రొఫెసర్ లక్ష్మీ నరసు జీవితాన్ని, రచనల్ని వెలుగులోకి తేవాలని డా॥ అంబేద్కర్ 1948 నుండి తాను మరణించే వరకు (1956) ప్రయత్నిస్తూనే ఉన్నారు. దానిలో భాగంగా 1948లో ప్రసిద్ధ ప్రచురణ సంస్థ థాకర్ అండ్ కంపెనీ చేత ప్రొఫెసర్ లక్ష్మీనరసు '' ఎస్సెన్స్ ఆఫ్ బుద్దిజం'' ప్రచురింపజేశారు. దేశ రాజకీయాల్లో అంత ముఖ్యమైన బాధ్యత నిర్వహిస్తూ కూడా సమయం దొరికినప్పుడల్లా ప్రొఫెసర్ లక్ష్మీనరసు రచనల కోసం ఆయన ప్రయత్నిస్తుండేవారు. 1954లో అధికారిక పనిమీద ఆయన మద్రాసు సందర్శించారు. ఆ సందర్భంలో ఆయన ప్రొఫెసర్ లక్ష్మీనరసు రచనల కోసం విచారించగా, ఆయన దృష్టికి ప్రొఫెసర్ లక్ష్మీనరసు అముద్రిత (unpublished) రచన ఒకటి వచ్చింది. అది ''ది రెలిజియన్ ఆఫ్ ఎ మోడరన్ బుద్దిస్ట్'' ( ఆధునిక బౌద్ధుడి మతం). లక్ష్మీ నరసు మరణించిన రెండు దశాబ్దాలకు దీన్ని డా॥ అంబేద్కర్ సంపాదించగలిగారు. అయితే ఈ పుస్తకం లభించిన రెండుసంవత్సరాలకే డా॥ అంబేద్కర్ మరణించారు. ఈ రెండు సంవత్సరాలు ఆయన అనేకమైన సమస్యలు ఎదుర్కొన్నారు. ఆయన ఆరోగ్యం కూడా అంతంత మాత్రంగానే ఉంది. అదే సమయంలో ఆయన బౌద్ధంపై స్వతంత్ర రచన చేస్తున్నారు. రాజకీయమైన కార్యకాలపాలు సరేసరి. ఈ పరిస్థితులలో ఆయన ఎంతో ఆశపడి ప్రచురించాలని మద్రాసు నుండి తీసుకెళ్ళిన ప్రొఫెసర్ లక్ష్మీనరసు గ్రంథం ''ది రెలిజియన్ ఆఫ్ ఎమోడరన్ బుద్దిస్ట్'' అనుకున్న విధంగా ప్రచురించలేకపోయారు. డా॥ అంబేద్కర్ ఈ రచనను ఎందుకు ప్రచురించలేక పోయారన్న విషయమ్మై రెండు భిన్నాభిప్రాయాలు వ్యక్తమయ్యాయి. ఒకటి డా॥ అంబేద్కర్ రాజకీయమైన పనుల ఒత్తిడి వల్ల ప్రచురించలేక పోయారని, మరొకటి ప్రొఫెసర్ లక్ష్మీ నరసు కుటుంబ సభ్యుల నుండి అనుమతి లభించని కారణంగా ప్రచురించలేక పోయారని. ఈ రెండింటిలో ఏది యదార్ధమో చెప్పటానికి కావాల్సిన సరయైన సమాచారం మాత్రం మనకు అందుబాటులో లేదు.

''డా॥ అంబేద్కర్ అండ్ నియో బుద్దిస్ట్ మూవ్‌మెంట్'' పుస్తక రచయితలు ఇలా అంటున్నారు. " In 1954, when Ambedkar visited Madras, he took the manuscript with the express desire to publish it. But political and constitutional activities kept him occupied and the book The Reobligion of a Modern Buddhist, is yet be published" (డా॥ అంబేద్కర్ 1954 లో మద్రాసు సందర్శించినప్పుడు, ఆయన రాతప్రతిని ప్రచురించాలన్న ఆకాంక్షతో తీసుకున్నారు. కాని రాజకీయం, రాజ్యాంగ పరమైన కార్యకలాపాల్లో నిమగ్నమై యుండటంవల్ల, ది రెలిజియన్ ఆఫ్

ఎ బుద్దిస్ట్ ఇంకా ప్రచురించ బడలేదు). నిజానికి ఈ రెండు సంవత్సరాలు (1954 - 1956) డా॥ అంబేద్కర్ జీవితంలో చాలా ముఖ్యమైనవి. కొత్తరాజకీయ పార్టీ నిర్మాణం కోసం కృషి మతమార్పిడి యోచన, రాజ్యాంగ రచనా కార్యక్రమం, బౌద్ధానికి బైబిల్ వంటి గ్రంథాన్ని అందించటం లాంటి కార్యక్రమాల్లో క్షణం తీరిక లేకుండా ఉండేవారు. అదే సమయంలో అనారోగ్యం. చివరకు 1956 డిసెంబర్ 6న మరణించారు. ఈ కొద్ది కాలంలో ఆయన చేయాలనుకొన్న అనేక పనులు పూర్తి చేయలేక పోయారు. అటువంటి వాటిలో ముఖ్యమైనది ప్రొఫెసర్ లక్ష్మీనరసు గ్రంథ ప్రచురణ. కుటుంబ సభ్యుల నుండి అనుమతి లభించక పోవటంవల్ల ప్రొఫెసర్ లక్ష్మీనరసు గ్రంథాన్ని డా॥ అంబేద్కర్ ప్రచురించలేకపోయారని ఈమధ్య మరొక రచయిత అభిప్రాయపడుతున్నారు. ఆయన శ్రీ వసంతమూన్. ఆయన డా॥ అంబేద్కర్ అప్రచురిత రచనల్ని వెలికితీసి ప్రచురించటంలో ఈనాడు మహారాష్ట్ర ప్రభుత్వానికి విశేష సహాయ సహకారాలు అందిస్తున్న వారిలో ముఖ్యుడు. శ్రీ వసంతమూన్ మహారాష్ట్ర ప్రభుత్వం ప్రచురిస్తున్న డా॥అంబేద్కర్ రైటింగ్స్ అండ్ స్పీచెస్‌కు ప్రధాన సంపాదకులు. వృత్తిరీత్యా మహారాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగి. మరాఠీ భాషలో డా॥ అంబేద్కర్ పైన, దళిత ఉద్యమం పైన రచనలు చేశారు. ఆయన మరాఠీలో రచించిన డా॥ అంబేద్కర్ జీవిత చరిత్రను డా॥ చాగంటి తులసి తెలుగులోకి అనువాదం చేయగా నేషనల్ బుక్‌ట్రస్ట్ వారు జాతీయ గ్రంథమాల సిరీస్‌లో ప్రచురించారు. దీనిలో శ్రీవసంతమూన్ డా॥ అంబేద్కర్ ప్రచురించాలన్న ఆకాంక్షతో తీసుకెళ్ళిన ప్రొఫెసర్ లక్ష్మీనరసు అముద్రిత ఆంగ్ల గ్రంథాన్ని గురించి ఒకకొత్త విషయాన్ని మన దృష్టికి తీసుకొచ్చారు. ఆవిషయాన్ని యథా తథంగా ఉటంకించటం కంటే సారాంశాన్ని చెబితే బాగుంటుంది. ఎందుకంటే అనువాదం పరమ గందరగోళంగా ఉంది తెలుగు భాషతో ఏమాత్రం పరిచయం ఉన్న వారయినా ఈ అనువాద గ్రంథాన్ని చదివితే ఆశ్చర్యపోతారు. అనువాదం ఎలా ఉందనేది ప్రస్తుతం మనకు అప్రస్తుత విషయమనుకోండి. ఈవిషయాన్ని అనుభవజ్ఞులైన గ్రంథ సమీక్షకులు, అనువాదకులు చూసుకుంటారు. ఇప్పుడు మాత్రం మనకు అవసరమైన విషయానికే పరిమిత మౌదాము. డా॥ అంబేద్కర్ మద్రాసు సందర్శించినప్పుడు సౌత్ ఇండియన్ బుద్దిస్ట్ అసోసియేషన్ నుంచి ప్రొఫెసర్ పి. లక్ష్మీనరసు రాసిన అముద్రిత రచన ''దిరెలిజియన్ ఆఫ్ ఎ మోడరన్ బుద్దిస్ట్'' (అనువాదకురాలి ప్రకారం లక్ష్మీనరసు గ్రంథం పేరు ''బుద్ధిజమ్ ఇన్ మోడరన్ లి ఇట్''! దీని అర్థ మేమిటో?) సంపాదించారు. 700 టైపు చేసిన పేజీలు ఉన్న ఈ అముద్రిత ప్రతి వారసుల అనుమతి లభించని కారణంగా ప్రచురణకు నోచుకోలేదు (డా॥ బాబా సాహెబ్ అంబేద్కర్ - రచయిత: వసంతమూన్ అనువాదం: డా॥ చాగంటి తులసి, నేషనల్ బుక్‌ట్రస్ట్ 1995 పే. 225). అయితే ప్రొఫెసర్ లక్ష్మీనరసు రెండో భార్యకుమార్తె చెప్పిన దాని ప్రకారం, ఆయన మరణానంతరం, లక్ష్మీనరసు సొంత గ్రంథాలయాన్ని, వారి స్వీయ రచనలన్నింటిని మహాబోధి సొసైటీ వారికి అప్పగించారు. కుటుంబ సభ్యులకు వాటితో ఎటువంటి సంబంధం లేదు. డా॥ అంబేద్కర్ కూడా లక్ష్మీనరసు అముద్రిత గ్రంథాన్ని సౌత్ ఇండియన్ బుద్దిస్ట్ అసోసియేషన్ నుండి సంపాదించారు కాని కుటుంబ సభ్యుల నుండి కాదు. అందువల్ల వారసుల నుండి అనుమతి అనే ప్రశ్నే ఉత్పన్నం కాదు. శ్రీ వసంతమూన్ తమ గ్రంథంలో (పైన పేర్కొన్న పేజీలోని పాద పీఠిక) పేర్కొన్నట్టు తీవ్రమైన పని ఒత్తిడిలో ఉన్నందు వల్లే అనుకున్న విధంగా ప్రచురించలేక పోయారని భావించటం సబబుగా ఉంటుంది శ్రీ వసంత మూన్ తమ గ్రంథంలో మరొక ఆసక్తికరమైన విషయాన్ని తెలియజేశారు.

72 సంవత్సరాల వయస్సున్న గణేశన్ అనేవ్యక్తి డా॥ అంబేద్కర్‌ను అనేక సార్లు కలిసి లక్ష్మీనరసు గ్రంథాన్ని ప్రచురించమని కోరారు అంటూ శ్రీవసంత మూన్ డా॥ అంబేద్కర్ శ్రీ కె. ఎస్. గణేశన్‌ల వ్యక్తిగత ఉత్తర ప్రత్యుత్తరాల్ని గురించి ప్రస్తావించారు ( డా॥ అంబేద్కర్ లేఖలు 10-7-50; 7-10-50; 11-7-51). ఇంతకూ ఈ కె. ఎస్. గణేశన్ ఎవరు? ఈయనకు ప్రొఫెసర్ లక్ష్మీ నరసు రచనలకు ఉన్న సంబంధమేమిటో తెలిస్తే ఇంకొన్ని కొత్త విషయాలు బయట పడవచ్చు. ప్రస్తుతం లభిస్తున్న ''లెటర్స్ ఆఫ్ డా॥ అంబేద్కర్'' (సంకలనం: ప్రొఫెసర్ సురేంద్ర అజ్ఞాత్, భీమ్ పత్రికా పబ్లికేషన్స్, జలంధర్, 1993) లో మాత్రం శ్రీ వసంతమూన్ పేర్కొన్న ఉత్తరాలు లేవు. బహుశా మహారాష్ట్ర ప్రభుత్వం ప్రచురించబోతున్న ''డా॥ అంబేద్కర్స్ కరస్పాండెన్స్'' (వాల్యూములు 20, 21) లో ఇవి లభించవచ్చు. అయితే ఈ వాల్యూములు ప్రచురించటానికి ఇంకా ఒకటి రెండు సంవత్సరములు పట్టవచ్చు ( చూడు: లెటర్స్, వసంతమూన్ లెటర్, దళిత్ వాయిస్ ( ఇంగ్లీషు ఎడిషన్) జనవరి 1-15, 1996). ఈ లేఖల ద్వారా తెలుస్తున్న ఆశ్చర్య కరమైన విషయమేమి టంటే డా॥ అంబేద్కర్ 1954లో ప్రొఫెసర్ లక్ష్మీనరసు అముద్రిత గ్రంథాన్ని సేకరించలేదు. అంతకు ముందే అంటే దాదాపు 1950 ప్రాంతాల్లో ఆయన దాన్ని సంపాదించారు. అందువల్లే 1950 - 51 మధ్య కాలంలోనే కె. ఎస్. గణేశన్ అనే అజ్ఞాత వ్యక్తి ఈ పుస్తకాన్ని ప్రచురించమని డా॥ అంబేద్కర్‌తో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపారు. ఇంతకూ డా॥ అంబేద్కర్ మద్రాసు ఎప్పుడు సందర్శించారు? ఏ సందర్భంలో ఈ అముద్రిత గ్రంథాన్ని సంపాదించారో తేలాలంటే డా॥ అంబేద్కర్ ఉత్తర ప్రత్యుత్తరాలు ప్రచురించబడే వరకు ఆగాలి. అంతవరకు ఈ సస్పెన్స్ తప్పదు. ఏది ఏమయినా డా॥ అంబేద్కర్ మద్రాసు సందర్శించినప్పుడు తమతో లక్ష్మీనరసు అముద్రిత గ్రంథాన్ని ప్రచురించాలన్న ఆకాంక్షతో తీసుకెళ్ళారనేది వాస్తవం. అది ఇంత వరకు ప్రచురించబడలేదన్నది మరొక వాస్తవం.

డా॥ అంబేద్కర్ అంటే ఎంతో అభిమానమున్న ఆంధ్రులం ఈ విషయంలో కాస్త శ్రద్ధకనబరచి ఆంధ్రుడైన ప్రొఫెసర్ పోకల లక్ష్మీనరసు అముద్రిత ఆంగ్ల గ్రంథాన్ని వెలుగులోకి తేవటానికి ప్రయత్నిస్తే బాగుంటుంది. ఆంధ్రాలో ఏ ఒక్క సంస్థయినా ముందుకు వచ్చి, ఆ గ్రంథాన్ని సంపాదించి, ప్రచురిస్తే ఆంధ్రులకు అంతర్జాతీయ ఖ్యాతి సంపాదించి పెట్టిన బౌద్ధ పండితుడు, కుల నిర్మూలనవాది, డా॥ అంబేద్కర్‌ను ప్రభావితం చేసిన మహా పురుషుడు ప్రొఫెసర్ పోకల లక్ష్మీనరసు రుణాన్ని తీర్చుకున్న వాళ్ళమౌతాము. అప్పుడే గిరీశం అన్నట్టు మనవాళ్ళు వట్టి వెధవాయలోయే అనికాకుండా మన వాళ్ళు మహాగట్టి వాళ్ళోయ్ అని అనుకోగలుగుతాము. అప్పుడే ఆంధ్రజాతి ముద్దు బిడ్డకు చరిత్రలో సరియైన గౌరవం కల్పించిన వాళ్ళమౌతాము. ఆలోచించండి.

★★★

''ప్రొఫెసర్ లక్ష్మీ నరసు 19వ శతాబ్దికి చెందిన మహాపురుషుడు. యూరోపియన్ల అహంకారాన్ని, జాతీయ భావప్రేరణతో ప్రతి ఘటించారు. సాంప్రదాయిక హిందూమతాన్ని సంస్కరణ నిబద్ధతతో వ్యతిరేకించేవారు. బ్రాహ్మణ ఛాందస వర్గాన్ని జాతీయ దృకథంతోను, క్రైస్తవ మత ప్రచారం దూకుడును హేతువాదంతోను వ్యతిరేకించేవారు. ఇవన్నీ కూడా బౌద్ధంపట్ల వారికి గల గాఢ అభిని వేశంతో సాగించిన కార్యకలాపాలు.'' డా॥ బి. ఆర్. అంబేద్కర్

# చిత్రకళా దాంపత్యం

–మాకినీడి సూర్య భాస్కర్

దంపతులది చెరొక వృత్తి కావచ్చు లేదా ఒకే వృత్తి కావచ్చు. వృత్తి వేరైనప్పుడు, వారు చేసే పనులు భిన్న స్వరూపం కలవి కావడంచేత వృత్తి ఒకటే అయినప్పుడు, వారు చేసే పనుల స్వభావం ఒకటే కావడం చేత కూడా కొంత మేలు ఉండవచ్చు, లేదా కొంత కీడూ ఉండవచ్చు.

దంపతులు యిరువురివీ వేరువేరు వృత్తులు అనుకుందాం. ఒకరి పని స్వభావం ఇంకొకరికి తెలియకపోవడంతో, ఒకరి పనిలోని నైపుణ్యాన్ని అంచనా వేయడంలో మరొకరు పొరబడవచ్చు, లేదా తెలియని విషయం, తాను పట్టించుకొనవలసినదేం ఉంటుందనుకొని ఒకరిపట్ల మరొకరు ఉదాసీనంగా ఉండవచ్చు. ఆ ఉదాసీనతతో ఏ విధంగా చేసినా, పని నిర్వహణ గురించి పట్టించుకోకనూపోవచ్చు.

దంపతులిరువురిదీ ఒకే వృత్తి అనుకుందాం. వారి పనుల స్వభావం ఇరువురికీ తెలియడంతో, ఒకరి లోపాలను ఒకరు ఎత్తి చూపుకొని, ఒకరినొకరు దిద్దుకొనే వీలుంటుంది. లేదా ఒకరి లోపాలను మరొకరు అలుసుగా తీసుకొని ఒకరినొకరు సాధించుకొనే అవకాశమూ ఉంటుంది.

వృత్తి వేరైనప్పుడు దాంపత్యం విభేదిత ఐక్యత అయితే, వృత్తి ఒకటే అయినప్పుడు అభేదిత ఐక్యత అవుతుంది. ఈ రెంటిలో ఏ ఐక్యత మంచిదనే ప్రశ్నేలేదు. ఎందుకంటే, దాంపత్యంలోని ఐక్యత వృత్తిమీద ఆధారపడే అంశం కాదు. అది ఆ దంపతులు పెరిగిన పరిసరాల మీద, ఉంటోన్న పరిసరాల మీద, వారివారి జీవన విధానాలపైన, వారి భావాలపైన, స్వభావాల పైన ఆధారపడి ఉంటుంది.

వృత్తిగాని ప్రవృత్తిగాని దంపతులిరువురిదీ ఒకటైనప్పడు, అదీ కళాసంబంధమైనప్పుడు ఆ దాంపత్యం ఎలా ఉంటుంది? కళామయంగా సాగుతుందా? వారి కళాజీవితం పరస్పరం ప్రభావితమౌతుందా? విభేదిస్తుందా? సూత్రప్రాయంగా కాకపోయినా, రేఖాత్మకంగా ఈ విషయమై ఆలోచించడమే ఈ వ్యాసం ఉద్దేశం.

చిత్రకారు లెందరో వున్నారు. పురుషులలోనూ, స్త్రీలలో కూడ. దంపతు లిరువురు చిత్రకారులు కావడం మాత్రం కొంత అరుదే. అటువంటి కొద్ది చిత్రకళా దంపతుల జీవన విధానాలను, కళా సంవిధానాలను పరిశీలించడం ద్వారా చిత్రకాళా దాంపత్యం యొక్క అభేదిత ఐక్యతలోని తీరుతెన్నులను పరిశీలించవచ్చు.

ప్రసిద్ధ చిత్రకారుడు దామెర్ల రామారావు, వారి సతీమణి శ్రీమతి సత్యవాణి ఇరువురూ చిత్రకారులు. అలాగే శ్రీ బి.వి. నరసింహారావు - శ్రీమతి కరుణ, శ్రీ పిలకా నరసింహమూర్తి - శ్రీమతి విజయలక్ష్మి, లామా గోవింద - లీగోతమి, ఎరల్ హెన్రీ బ్రూస్టర్ - శ్రీమతి ఆక్సాబ్రూస్టర్, శ్రీ ఇట్టేల గోపాలరావు - శ్రీమతి వనలత.

చిత్రకారులు తమ బంధువర్గంలోని వారిని మోడల్స్‌గా వినియోగించుకోవడం పరిపాటే. దామెర్ల రామారావు వారి సతీమణిని చాల చిత్రాలలో మోడల్‌గా ఉపయోగించుకున్నారు. ఆమెకు జరిగిన సీమంతాన్ని కనులారా తిలకించి, పరవసించి 'పుష్పాలంకరణ' అనే చిత్రాన్ని

రచించారాయన. ఈ చిత్రంలో స్త్రీల రూపరేఖావిలాసాలు, వారి వస్త్రధారణ విధానం, మన మనసులకు హత్తుకోవడంతో, ఆ చిత్రంలోని పేరంటాళ్లు జల్లేపన్నీటి జల్లులు మనహృదయాలలో చిలకరింపబడతాయి.

ఆంధ్ర చిత్రకళారంగాన్ని పునరుజ్జీవింపజేసి ఒక ఒరవడిని సృష్టించిన రామారావుగారి రచనా సంవిధానం వారి సతీమణిని కూడా ప్రేరేపించి ఆమెను ఆ బాటలోనే నడిపించింది. ఆ విధంగా శ్రీమతి సత్యవాణి భర్తను నీడలా అనుసరించారు.

బి.వి. నరసింహారావు, శ్రీమతి కరుణారావుల జీవితాలను పరిశీలించినప్పుడు దంపతులిరువురిదీ ఒకే వృత్తి అయితే మంచిదనిపిస్తుంది. వీరిద్దరూ ఒకరికొకరికి చేదోడువాదోడుగా ఉంటూ, చిత్రరచనా విధానంలో ఒకే బాటలో పయనించి వారి జీవితాలను సైతం కళాత్మకం చేసుకున్నారు. రీతిరీత్యా ప్రాచ్యవిధానంలోను, కళావాదం ప్రకారం వాస్తవ పద్ధతిలోను మొదలుపెట్టి ఎన్నో చిత్రాలను రచించారు వారు. తరువాత యిరువురూ ఆధునిక రచనా సంవిధానంలోనికి మారడం జరిగింది. 1956లో దంపతులిరువురూ పారిస్ వెళ్లి మూడు సంవత్సరాలపాటు చిత్రరచనలో సాధన చేసారు.

సంవిధానం రీత్యా ఈ దంపతులు ఒకే బాటలో నడిచినా, వారి రచనా విధానంలో మాత్రం ఎవరి వ్యక్తిత్వాన్ని వారు నిలుపుకొన్నారు. అందుకే వారిరువురి కళావ్యాసంగం కేవలానుసరణగానే మిగిలిపోక దేనికదే ప్రత్యేకతను నిలుపుకొంది. బాల్యం నుండీ శ్రీమతి కరుణకు గల సంగీత కళాభిజ్ఞత ఆమె చిత్రకళలో వర్ణప్రధానమైన దృశ్య సంగీతంగా పరిణమించింది. 'సంగీత ప్రశాంతత' అనే ఆమె చిత్రంలోని వర్ణమాధురి చాలా శ్రావ్యంగా ఉంటుంది. అలాగే శ్రీ నరసింహారావు చిత్రణలో వెలుగునీడల మూడు డైమెన్షన్లతోపాటు కాంగ్రా చిత్రాల వర్ణమాధుర్యం కూడ కనబడుతుంది.

ఆధునిక చిత్రకారులుగా మారాక కూడ వారిరువురూ పరస్పరం ఒకరినొకరు ప్రభావితం చేసుకుంటూనే ఎవరి ప్రత్యేకతను వారు నిలుపుకున్నారు. నరసింహారావుది స్థూలతావాదాని కి **(cubism)** చెందితే, శ్రీమతి కరుణ చిత్రణసారూప్యనైరూప్య విధానాలకు మధ్యస్థంగా ఉంటుంది. విషయమేదైనా, ప్రకృతిలోని రూపాల ప్రమేయం లేకుండా, కేవల వర్ణసమ్మేళనంతోనైరూప్యరీతిలో శ్రీరావు చిత్రిస్తే, శ్రీమతి రావు చిత్రణలోని వస్తువు ఫలానాదని తెలుస్తూనే ప్రకృతిలోని రూపంతో విభేదిస్తుంది. శ్రీమతి కరుణ శ్వేత ధూసర వర్ణాలను ప్రజ్ఞతో చిత్రించగా, శ్రీ రావు ఆకుపచ్చ, పసుపుపచ్చ, నీలం, ధూమ్రవర్ణాలతో తమ చిత్రాలలో వర్ణగీతాలను పలికిస్తారు.

ఈ విధంగా ఒకే మాదిరిగా ఆరంభమైన రావుదంపతుల కళావిన్యాసం మొగ్గ తొడిగి మార్గవైవిధ్యంతో వికసించింది.

పిలకా నరసింహమూర్తి, శ్రీమతి విజయలక్ష్మి దంపతులు ఉమ్మడిగా కలిసి చిత్రరచన సాగించారు. కష్టసుఖాలను దంపతులు ఉమ్మడిగా పంచుకోవాలనే ఆదర్శం వీరి కళాజీవితంలో ఫలించింది. కీర్తిప్రతిష్ఠలను కూడా ఉమ్మడిగానే పంచుకొన్న అపూర్వ కళాత్మక దాంపత్యం వీరిది.

దంపతులిరువురూ పౌరాణిక చిత్రాలను విరివిగా చిత్రించారు. చిత్రరచనలో శ్రీమతి విజయలక్ష్మి తన భర్తకు ఎంతగానో సహకరిస్తారు. దంపతులిరువురూ ఉమ్మడిగా తమ చిత్రాలను రెండుసార్లు మద్రాసులో ప్రదర్శించారు. రామాయణానికి సంబంధించిన 50 చిత్రాలను రచించి వీరు త్రివేండ్రంలో ప్రదర్శించారు. అంతేకాదు, ఒకే చిత్రకళాప్రదర్శనలో దంపతులిరువురూ బహుమతులు పొందడం వారి కళాజీవన సౌందర్యానికి మచ్చుతునక. ధర్మయుగ్, భారతి వంటి పత్రికలలో దంపతులిరువురు ఎన్నో చిత్రాలను ప్రచురించారు.

నరసింహమూర్తి భారీకుడ్య చిత్రాలను చిత్రించడంలోను, వాటి నకళ్లను తీయడంలోను నేర్పరైతే, శ్రీమతి విజయలక్ష్మిగారిది మినియేచర్ల రచనలో అందె వేసిన చేయి.

జీవితంలోని ప్రతిక్షణాన్ని ఉమ్మడిగా పంచుకొన్న కమ్మని దాంపత్యం శ్రీమతి విజయలక్ష్మి నరసింహ మూర్తుల జంటది. వారు ఒకరికోసం ఒకరు పుట్టినట్లుగా జంటగా చిత్రరచన సాగించారు. జంటగా బహుమానాలందుకున్నారు. జంటగా కీర్తి ప్రతిష్ఠలార్జించారు. జంటగానే కళాతపస్సు సాగించారు. వారి దాంపత్యం అపురూప కళాసమ్మేళనం. వారి జీవితం ధన్యం.!

ఎరల్‌హెన్రీ బ్రూస్టర్, శ్రీమతి అక్సా బ్రూస్టర్‌లది చిత్రకళే స్వయంగా కూర్చిన దాంపత్యం. ఆపైన ఇరువురి జీవితాలు కళకే అంకితమయ్యాయి.

ఎరల్ బ్రూస్టర్ వేస్తూండే స్త్రీమూర్తుల రూపరేఖా విలాసాలలో కొన్ని ప్రత్యేకమైన పోలికలు కనిపిస్తూ ఉండేవి. ఆపోలిక లెవరివో ఆయనకైతే తెలియదు. కాని, ఆయన మిత్రులు ఆపోలికల ఆధారంగా ఒకామెను ఎరల్ బ్రూస్టర్‌కు పరిచయం చేస్తారు. ఆమెపేరు అక్సా. 1910లో వారి వివాహం జరిగింది. వెంటనే వారు సిసిలీ దీవికి పయనించారు. వారి కళావైవాహిక జీవితం చాలవరకు ఇటలీలోను, ఫ్రాన్సులోను గడిచింది. 1922వరకు వారు ఉమ్మడిగా ఎన్నో చిత్రప్రదర్శనలను ఇటలీ, ఫ్రాన్సులలో ఏర్పరచారు.

వీరిశైలి ఎవరిది వారిదే. చిత్రణలో ఎవరి భావాలు వారివి. వీరు ఒకరికొకరు ఛాయగా మారలేదు.

హెన్రీ బ్రూస్టర్ 1878లో అమెరికాలోని క్లీవ్‌లాండులో జన్మించాడు. చిన్నప్పుడే, ధరించిన పసుపు, నీలం రంగు బట్టలు ఆయనలోని వర్ణ చైతన్యాన్ని మేల్కొలిపాయి. తరువాత తండ్రి ద్వారా సంపాదించిన రంగు రంగు గుడ్డపీలికలు ఆ చైతన్యాన్ని వికసింపజేసాయి. మొదట్లో క్లీవ్‌లాండ్ విశ్వవిద్యాలయంలోను, పిదప న్యూయార్కులోని కళా విశ్వవిద్యాలయంలోను చిత్రకళాభ్యాసం చేస్తూ 1910 వరకు సాధన చేసాడు. శ్రీమతి అక్సాబ్రూస్టర్ కళాసాధన అమెరికన్ విశ్వవిద్యాలయంలోను, పారిస్‌లోను సాగింది. విద్యార్థినిగా ఉండగానే యూరప్‌లోని ప్రముఖ కళాకేంద్రాలను దర్శించి ఆమె తన కళాభిజ్ఞతను పెంచుకొంది.

హెన్రీ బ్రూస్టర్ తన కళాసంవిధానాన్ని వాస్తవవాదంతో మొదలుపెట్టి క్రమంగా నైరూప్య విధానానికి పరిణమింపజేసాడు. తను చిత్రించే ఆకారాలకు సరళాతి సరళమైన రూపాలనిచ్చి ప్రాకృతిక రూపానికి భిన్నంగా ఆవిష్కరించేవాడు. దీనికి భిన్నంగా శ్రీమతి బ్రూస్టర్ మోడల్ చిత్రణ చేసేది. ఇటలీలో ఉండగా గొప్ప సాహితా వేత్త అయిన డి.హెచ్. లారెన్స్‌ను మోడల్‌గా

ఉంచుకొని ' ఒక క్రైస్తవ సాధువు' అన్న చిత్రాన్ని ఆమె రచించింది. ఆమె రచించిన ఇంకా ఎన్నో చిత్రాలకు లారెన్స్ మోడల్‌గా పనిచేసారు.

వర్ణ వినియోగంలో కూడా దంపతులిరువురిదీ భిన్న మార్గమే, హెన్రీ బ్రూస్టర్ విరుద్ధ వర్ణాలను ఉపయోగించి సున్నితమైన ఫలితాన్ని సాధించడంలో దిట్ట. నీలం ప్రక్క పసుపు, నలుపు దగ్గరగా తెలుపు వగైరా వర్ణాలతో ఆయన ఒకానొక విచిత్రభ్రాంతిని తన చిత్రాలలో కలగజేసేవారు. శ్రీమతి ఆక్రా బ్రూస్టర్‌కు ఎరుపు, గోధుమ వర్ణాలు బాగా ఇష్టం. ఎరుపు వర్ణంతో ఆమె ఎన్నో ఉష్ణదేశాల పుష్పజాతులను చిత్రించింది. అలాగే ఆమె రచించిన మానవ మూర్తులు అధికంగా గోధుమ వర్ణంలో ఉంటాయి.

వీరిరువురి శైలి, వస్తుస్వీకృతి ఎంతో వైవిధ్యభరితం. హెన్రీ బ్రూస్టర్ నైరూప్య చిత్రాలను చిత్రిస్తే, శ్రీమతి ఆక్రా ఉష్ణదేశాల అరణ్యాలను, అక్కడి ఆదిమ వాసులను, వారి ఆచార వ్యవహారాలను చిత్రించడంలో ఆనందం పొందేది. హెన్రీ చిత్రాలు వర్ణ ప్రధానాలైతే, శ్రీమతి ఆక్రాచిత్రాలు డిజైను ప్రాధాన్యాలు.

1921-22లో దంపతులిరువురూ సింహళంలోను, భారతదేశంలోను పర్యటించారు. చివరికి 1936లో భారతదేశంలోని ఆల్మోరా దగ్గరనున్న కాళీఘాట్ వద్ద ( కుమావూ హిమాలయ శ్రేణులలో) స్థిరపడ్డారు. హిమాలయవాసంతో దంపతుల చిత్రకళలో హిమాలయాలు, తత్ సౌందర్యం ప్రభావం చూపాయి. హెన్రీ హిమాలయ చిత్రాలను వైవిధ్య భరితమైన వాతావరణ శోభతో - నీలి ఆకాశం, లోయలలో క్రమ్ముకువస్తున్న పొగమంచు, వంపులు తిరిగిన పర్వత మార్గాలు - వాస్తవికంగా చిత్రించేవాడు. శ్రీమతి ఆక్రా తన పర్వత చిత్రాలను వాస్తవికతకు మారుగా సాంకేతిక రీతిలో చిత్రించేది. పృష్ఠభాగంలో అస్పష్టంగా పర్వత పంక్తులు, వాటికి ముందర స్త్రీరూపంలో సంకేతీకరింపబడిన పర్వతాలు - ఈ విధంగా ఆమె పర్వత చిత్రణ కాల్పనిక సాంకేతిక రీతిలో సాగేది. హెన్రీ మూర్తి చిత్రణలో రూప పుష్టికంటె రంగులశోభ ప్రబలమైతే, శ్రీమతి ఆక్రా చిత్రణలో చక్కని రూపాలు గోచరమయ్యేవి.

ఇన్ని విధాలుగా దంపతు లిరువురూ తమ కళావ్యాసంగ అభివ్యక్తిలో విభేదించినా, మాధ్యమం విషయంలో మాత్రం ఒకటయ్యారు. ఇద్దరూ సామాన్యంగా తైలవర్ణాలలోనే చిత్రించారు.

కళాజీవితంలో ఇంతగా విభేదించిన ఈ దంపతులు నిజ జీవితంలో ఎలా జీవించారో తెలియదు.

లామా గోవింద ఎవరివద్దా చిత్రకళను అభ్య సించకపోయినా, స్వయం ప్రతిభతో గొప్ప చిత్రకారుడయ్యాడు. 1934లో మొదటిసారి భారతదేశంలో గోవింద చిత్రాల ప్రదర్శన జరిగేనాటికే ఆయన లబ్ధప్రతిష్ఠుడైన చిత్రకారుడు. గోవింద చిత్రాలను రవీంద్రనాథఠాగూర్, నందలాల్ బోసు వంటి ప్రఖ్యాత పురుషులు కొనియాడారు.

శాంతినికేతన్‌లో కొంతకాలం గోవింద చిత్రకళాచార్యునిగా ఉన్నాడు. ఆ కాలంలోనే శాంతి నికేతనంలోనే చిత్రకళను అభ్యసిస్తూన్న పారశీ అమ్మాయి నొకామెను వివాహం చేసుకున్నాడు. తరవాత ఆమె ' లీ గోతమా' పేరుతో గొప్ప చిత్రకారిణిగా రూపొందింది.

లామా గోవింద, లీ గోతమాల జీవితం కళామయం, ఇద్దరూ కళాకారులు కావడం నిజంగా వారి జీవితాలకే వరంగా పరిణమించింది. కుమావూ హిమాలయాలలో ఆల్మారావద్ద నివాసం ఏర్పరచుకొని వారిరువురూ తమ కళావ్యాసంగాన్ని సాగించేవారు. ఎన్నోసార్లు ఇద్దరూ కలిసి వారికే తెలియని మార్గాల గుండా పయనించి పశ్చిమ టిబెట్‌లోని ప్రసిద్ధి చెందిన చపరాంగు బౌద్ధమతంలోనూ, మరికొన్ని చోట్ల నున్న ప్రాచీన కుడ్య చిత్రాలకు నకళ్లు రచించారు.

కళ వీరిరువురి జీవితాలను పెనవేసింది. దంపతులిద్దరూ ఎన్నో ప్రకృతి చిత్రాలను రచించారు. లామా తక్కిన చిత్రాల్లవలె ప్రకృతి చిత్రాలు కూడా గంభీరమైనవైతే, గోతమా చిత్రాలు ప్రత్యేకమైన లయతోను, సుకుమార వర్ణ విన్యాసంతోనూ కూడి దృశ్యసదృశంగా తోస్తాయి. లామాశైలి వాస్తవికమైతే, గోతమీశైలి అలంకారయుతం.

పరిశీలించిన నాలుగైదు కళాదాంపత్యాలలోను ఒకరికొకరికి అనుగుణంగా పోయేవే అధికంగా ఉన్నాయి. రావు దంపతులు, విజయలక్ష్మి నరసింహమూర్తి దంపతులు, లామా గోవింద - గోతమీ దంపతులు కళాదాంపత్యాలు పారస్పరిక ప్రభావంతో సంపూర్ణంగా అభేదక ఐక్యతతో సాగితే, బ్రూస్టర్ దంపతుల కళా జీవితం సామరస్యంగా పోతూనే అంతరంగికంగా విభేదించింది. దీనికి కారణం, ముందు అనుకొన్నట్లుగానే, వారి పరిసరాల మీద, వారి భావాలు, స్వభావాల మీద ఆధారపడి ఉండవచ్చు. అయితే ముఖ్యమైన భేదం ఒకటి గోచరమవుతోంది. రావుదంపతులు, విజయలక్ష్మి నర సింహమూర్తి దంపతుల సంస్కృతీ సంప్రదాయం భారతీయం కావడం కావచ్చు. భారతీయ సాంప్రదాయం ప్రకారం భార్య భర్తకు అనువ్రతగా ఉంటూ, భర్తను అనుసరించాలన్నది నియమం. లామాగోవింద, లీగోతమీలు కూడ ప్రాచ్యదేశాలకు చెందినవారైతే, బ్రూస్టర్ దంపతులు మాత్రం పాశ్చాత్యదేశంలో పుట్టి పెరిగినవారు. ప్రాచ్యాసంస్కృతీ సంప్రదాయాలు పాశ్చాత్య సంస్కృతీ సంప్రదాయాల కంటె ఎంతో భిన్నమనే విషయం అందరికీ తెలిసిందే. ఈ సంస్కృతీ సంప్రదాయాల భేదం కూడ ఇందుకు కొంత దోహదం చేయవచ్చు. అయితే, కచ్చితంగా చెప్పలేం.

దంపతుల అభేదక వృత్తి డాక్టరు, ప్లీడర్లు, టీచరు వంటి ధన సంపాదనా వృత్తులైతే, పరిస్థితి ఎలా ఉంటుందో ఊహించలేం. వారిమధ్య ఆర్థికపరమైన లావాదేవీలతో భేదాభిప్రాయాలు, అభిప్రాయభేదాలు తలెత్తవచ్చు. అలా కాక అర్థసంపాదనార్థం కానటువంటి కళాసంబంధమైన వృత్తులు, ప్రవృత్తులు అభేదకవృతి అయ్యే విషయంలో పరిస్థితి మనం పరిశీలించిన కేసులలోవలె అధికంగా సామరస్యంగానే సాగవచ్చు. ఎందుకంటే కళలు ఆనందం నిమిత్తమున్నవి. అవి జీవితంలో నీరసాన్ని పారద్రోలి రసాన్ని నింపుతాయి. పొందేది ఆనందమైనప్పుడు, విభేదించవలసిన అవసరం అంతగా రాదు కదా!

* * *

# కల లోపలి కల

-డా. యు. ఏ. నరసింహమూర్తి

"Poetry is a kind of inverted dream' అంటారు క్రిస్టొఫర్ కాడ్వెల్. 'నన్నునేను తిరగేసి తొడుక్కున్నాను'' అంటాడు మన ఆధునిక కవి. స్వప్నసృష్టికి కర్త ఈశ్వరుడే కాని జీవుడు కాడని మన ప్రాచీనుల విశ్వాసము. జాషువ దృష్టిలో కవి ఈశ్వరుడే. 'మాయామాత్రం స్వప్నదర్శనమ్' అని శంకర భగవత్పాదు లంటారు. స్వప్నము మాయామాత్రమైనా అది భావి శుభాశుభ సూచకమని ఛాందోగ్యోపనిషత్తు చెప్తుంది. కల అబద్ధం. కవిత్వమూ అబద్ధమే. జాగ్రదవస్థలోను స్వప్నావస్థలోను అనుభవానికి భేదంలేదు. అలాగే కవిత్వానుభవంలోను లౌకికానుభవంలోను భేదంలేదు. స్వప్నసృష్టికి ఉపాదాన కారణంలేదు. రూపపరివర్తనం ఉంది. స్వప్నం దృశ్యం. జాగరం కేవలం దృశ్యంకాదు. అందులో రూపపరివర్తనం లేదు. ఈ రెండింటి మధ్య సమన్వయం సాధించడానికి కవులు ప్రయత్నిస్తారు. కార్మికస్వర్గాన్ని కలగన్న శ్రీశ్రీ ''ఈస్వప్నం బుజువవుతుంది. ఈ స్వర్గం నిజమవుతుంది.'' అన్నది ఈ సమన్వయదృష్టితోనే.

కవిలోని రెండుముఖాలు రెండు ప్రపంచాల మధ్య సమత్వాన్ని సాధించడానికి సంఘర్షిస్తాయి. ఆ రెంటిలో ఒకటి ప్రాకృతము - అసంబద్ధము అసంకల్పితము అయిన స్వప్న ప్రపంచం. ఇంకొకటి పోతపోసి తీర్చిదిద్దబడ్డ సుందరప్రపంచం. ఈ విరుద్ధశక్తుల ఐక్యంలో రూపొందిన అనిర్వచనీయ పరిష్కారమే కవిత్వం. 'కల లోనే ఒక మెలకువగా మెలకువలోనే ఒక కలగా' అన్న కవివాక్యంలో ఇమిడివున్న కమనీయమైన రహస్యమిదే.

ఫ్రాయిడ్ కలకు కవిత్వానికి నిర్మాణాత్మకమైన సంబంధం ఉందంటాడు ప్రెస్కాట్ కవిత్వం కూడా కలల్లాగే అణచిపెట్టబడ్డ కోరికలను పరకాయ ప్రవేశం ద్వారా వెల్లడించడమే నంటాడు. అయితే కవిత్వాన్ని అతీంద్రియ సంబంధమైన నూత్నకాల్పనిక దృక్పథంతో బహుళార్థ సాధకమైన ధ్వని ప్రపంచంగా భావించడంతో ఫ్రాయిడ్ సైకో ఎనాలిసిస్ పై నీళ్లుచల్లాడు. కళాత్మక వ్యాపారం వాంఛాపరితృప్తికి సంబంధించినదే అయినా అది కేవలం అణగారిన కోరికలను వెల్లడించేది మాత్రం కాదన్న వాదంతో పార్కర్ ఫ్రాయిడ్ వాదాన్ని నియమితం చేసేడు. వీట్జ్ అనే విమర్శకుడు కళాత్మక అనుభవం అప్రయత్నంగా సుప్తచైతన్యంలో ఉద్గమిస్తుందనడాన్ని అంగీకరించడు. మైథునంలో కామవాంఛను తీర్చుకోవడం ఎంత సహజంగా జరుగుతుందో కళాత్మకవ్యక్తీకరణ కూడా అదేవిధంగా జరుగుతుందంటాడతను.

సూక్ష్మనాడులలో బుద్ధి ప్రసరించడమే స్వప్నమని మన పూర్వులమాట. అవిద్య అనే చీకటి రూపంలో ఉండే నిద్ర వ్యావహారిక జీవుణ్ణి ( చిదాభాసుడు) ఆశ్రయించి ఉంటుంది. ఆ నిద్ర ఆవరణశక్తి - విక్షేపశక్తి అనే రెండు రూపాలలో ఉంటుంది. ఆవరణశక్తి జీవుడి పూర్వానుభవాలకు సంబంధించిన జీవ - జగత్తులను ఆవృత్తి చేస్తుంది. విక్షేపశక్తి స్వప్నావస్థలో మళ్లీ నూత్న జీవ జగత్తులను కల్పిస్తుంది. స్వప్నంలో కన్పించే ఈ జీవ జగత్తులు తెలివిపొందిన వ్యక్తిలోను ఉండవు; స్వప్నంలోను ఉండవు. అందుచేత స్వప్నం ప్రాతిభావిక సత్యమే గాని వ్యావహారిక సత్యం కాదు. అంతఃకరణ ప్రవృత్తి చిచ్ఛాయతో తాదాత్మ్యాన్ని పొంది స్వప్న ప్రపంచంలో వాసనలను అంటే సంస్కారాలను కల్పిస్తుంది. చైతన్యంలో ప్రతిఫలించే ఆ అంతఃకరణ ప్రవృత్తే జాగ్రద్దశలో ఇంద్రియాల సహాయంతో బాహ్య విషయాలను కల్పిస్తుంది. అభినవగుప్తుడు స్వప్నానుభవంలో వాసనలకు గల ఈస్థానాన్ని గుర్తించి రససిద్ధాంతంలో వాసనకు స్థానం కల్పించాడు. అభినవగుప్తుడి

సిద్ధాంతంలో సామాజికుడిలో వాసనారూపంగా ఉన్న స్థాయి విభావాను భావసామగ్రి మూలంగా ప్రబుద్ధమై రసానుభవాన్ని కలిగిస్తుంది. వాసనలేని రసాను భవంలేదని నిర్ధరిస్తూ అభినవగుప్తుడు రసానుభవాన్ని కల లోపలి కల అన్నాడు. కల అనుభూతికి జ్ఞాపకానికి వారధి అన్న బెర్గ్‌సన్ (Bergson) మాట ఇక్కడ జ్ఞాపకం చేసుకోవాలి.

అనాదిగా మానవుని ఊహ సమకాలీన వాస్తవికత కంటే ఏదో ఒక గొప్పను సాధించడం కోసం ఊహలు కొనసాగిస్తూనే ఉంది. అందుకే ''మనం చెయ్యబడేది కలలు చేయబడ్డ పదార్థాలతో' అంటాడో కవి. అచేతనావస్థలో పేరుకొన్న గుప్తవేదనలు చైతన్యంలోకి చల్లగా జారుకునే స్థితిస్వప్నం. చేతనావస్థలోని కట్టడి - ఆత్మవిమర్శ - నైతికదృష్టి దీనికి అడ్డుకట్టకట్టినప్పుడు ఆగుప్తవేదనలు వెనుతిరిగిపోక పద్యాల పగటి వేషాల్లో దూరి వెల్లడవుతా యంటాడు ఫ్రాయిడ్. ఆ దృష్టితోనే ఇస్మాయిల్ ''మూసుకున్న గుడ్డు కనురెప్పల క్రింద చుట్టుకు పడుకున్న కలల దారపు ఉండని' అంటూ కవిత్వాన్ని పరిచయం చేశాడు.

సుషుప్తిలో అహంకారం లయమవుతుంది. అందువల్ల దేహం అచేతన మవుతుంది. స్వప్నంలో అహంకారం అర్ధవికాసాన్ని కలిగి ఉంటుంది. జాగరణంలో అది సంపూర్ణ వికాసాన్ని కలిగి ఉంటుంది. అర్ధస్వప్నావస్థలోని నిర్వ్యాపారంలో కార్యాచరణగా, నియమిత విశృంఖలత్వం, అదుపుతప్పిన అదుపును, నిలిపి కవి దానిని ఒక సుశిక్షిత స్వప్నంగా మలుస్తాడు. అందుకే బైరాగి కవిత్వాన్ని 'నిజం కంటె నిజమైన కల' అన్నాడు.

కల కావాలంటే రాదు, కవిత్వమూ అంతే. కల ప్రతీకాత్మకమైనది. ఆ ప్రతీకలను సంబంధిత నిష్పన్నరూపాల అర్థచ్ఛాయల ద్వారా అధ్యయనం చేసి కలను కేవలం మానసిక వికారంగా గుర్తిస్తున్నారు. ఆ మనసు అగాధమైనది. ''నిశ్చేష్టిత నిర్భాషిణి నిత్యం కుంగుతూ ఉండే సరస్సు మనస్సు, చూస్తూ ఉండాలి ఏ కమలం ఉబుకుతుందో పైకి'' అంటాడు వేగుంట.

ఆ కమలం స్వయం సముద్భూత మయ్యేది. కలలు, కవిత్వమూ కూడా స్వయం సముద్భూతాలే. కలలను విశ్లేషించేవారు అవి అర్థరహితమైన భావచిత్ర సంకలనాలు కావన్నారు. కలల దొక విచిత్ర భాష అన్నారు. ఆ భాషలో వ్యాకరణ సంబంధాల కోసం వెతికి ప్రయోజనం లేదన్నారు. కలను చిన్నచిన్న శకలాలుగా విడగొట్టి వాటి మధ్యగల అంతస్సంబంధాలను నిరూపించడం ద్వారా ఆధునిక కవిత్వంలోని నిర్మాణ మార్మికతను నిరూపించే కీలు దొరుకుతుందన్నారు.

సుప్తచైతన్యంలో జ్ఞాపకాలే కలల పడుగుపేకలు. అయినా తరుచుగా వాటిని మనం గుర్తుపట్టలేము. అవి గతకాలపు చీకటి కోణాల్లోని శిథిలస్మృతులు కావచ్చును. చేతనావస్థలో అవి పూర్తిగా రూపుకట్టని అస్పష్టాకృతులుగా, అనిర్దిష్ట భావాలుగా ఉంటాయి. జీవితంలోని వివిధ దశలకు చెందిన చెదరిన జ్ఞాపకాల అతుకులబొంత కావడంవల్ల కల గుర్తించడానికి వీల్లేనిదిగా, అసంబద్ధంగా రూపొందుతుంది. తర్కసహాలు కాని ఈ అసంబద్ధ భావచిత్రాల మధ్య నుండే అంతరాలను పూడ్చుకుంటూ కలకు ఒక వివరణ ఇవ్వడానికి కవి మేధ ప్రయత్నిస్తుంది. ముక్కూమొహం తీరూసారూలేని ఇతర జ్ఞాపకాలను తోడుకుని వాటిని జతపరచి కలలకు ఒక అర్థాన్ని కల్పించడానికి ప్రయత్నిస్తుంది విమర్శకుల భావన. ఈ పాశ్చాత్య భావన నందుకున్నారు. మన ఆధునిక కవులు. 'కలలు మాకు యథార్థాలు' అని నారాయణబాబు అన్నా, 'రస్తాలు వేస్తా కలల్లోకి' అని గుంటూరు శేషేంద్రశర్మ అన్నా ఈ ప్రభావంతోనే అన్నారు.

''శబ్దాల ఇటుకలేర్చి అర్ధాల కిళ్లు కట్టను - పుల్లలు పుడకలేర్చి కలలకు గూళ్లుకట్టను' అన్న బైరాగి కవిత్వం శబ్దార్ధాల పరిమితి నధిగమించిన ఒక అనిర్వచనీయ సుందరస్వప్నంగా భావించాడు. దాని అప్రయత్న సాక్షాత్కారాన్ని ఇస్మాయిల్ 'ఒకానొక సూది తోక ఊపుకుంటూవచ్చి, నిద్రవిప్పదీసి నిన్ను అల్లడం మొదలెడుతుంది' అంటూ ఆ అనిర్వచనీయ మార్మికసృష్టి బీజాన్ని ఆ మార్గంలో ఆవిష్కరించాడు.

నేటి కాలపు కవిత్వంలో రెండు మార్పులు కన్పిస్తాయి. కవి తార్కిక సంవాదాన్ని వదలి తక్షణానుభూతిని అందిన దానిని అందినట్లుగా వ్యక్తంచేయడం ఒకటి. మనస్తత్వాన్ని అధ్యయనం చెయ్యడంలో వచ్చిన మార్పు ఇంకొకటి. ఇందువల్ల కవిత్వాధ్యయనంలో మార్పువచ్చింది. ఒక పద్యంలోని పరమార్థాన్ని విస్తారమైన వివరణ తెలియజేయగలదని ఊహించవలసిన పనిలేదు. మనలోని అజ్ఞాతము, నిబిడము అయిన అనుభూతి ఒకానొక 'స్వప్నలిపి' నివెలుగుతో నింపగలదు. ఒక్కొక్కప్పుడు అది పద్యంలో ఉండదు. మనలో ఉంటుంది. మనం కలగనలేకపోతే ఆ లిపి మనకర్థం కాదు. ఆ కవిత్వాన్ని మనం కనుక్కోలేము. ఈ దశలోనే అభినవగుప్తుడు రసాన్ని 'కల లోపలికల' అన్నాడు.

## ANSWERS

He was drunk or drugged. Being zonked also means very tired or exhausted.

Yuppie is an acronym for young Urban Professional. It carries a slightly derogatory connotation as it implies an inordinate interest in upward mobility through materialist goals: Money, clothes, physical fitness, etc. The word 'yummie' is an acronym for young Upwardly Mobile Marxist' and is also a slightly derogatory word for the leftist intellectuals. The similar sounding word 'yummy' is an expression for anything delicious and mouth watering.

3. Sorry, chums! You will have a hell of a time. A 'xanthippe' is an ill-tempered and shrewish woman. The word has come from Xanthippe, Socrates's nagging wife who always kept the poor philosopher on tenterhooks.
4. Probably you wouldn't because a gasconade' is only a boastful and empty talk. As a verb it means - to boast.
5. It was a monetary system in which currency was convertible into either gold and silver in a fixed ratio. Widely adopted in the early 19th century, it proved unstable, as one metal was always under valued and one overvalued.
6. It is a distinctive mark or feature, e.g., "Courtesy is a cachet of good breeding." The word also denotes an expression of approval especially from someone of great prestige.
7. A circle or halo round the head in representation of a saint. This characteristic was excessively used in the medieval European paintings, which can be seen to this day in various churches and museums strewn across Europe.

'Hedging' is a commercial practice which enables a trader or speculator to protect himself against unpredictable changes in price. In commodity markets. trading in futrues' (goods for delivery in the future) constitutes a hedging practice.

9. The 'Kamikaze' was the small Japanese aircraft on a suicide mission against the U.S. Warships in the Second World War. The pilot of a 'Kamikaze' deliberately crashed his aircraft into the target, sacrificing his life for the country. Twenty - one U.S. ships were sunk in 1941 - 42 by such suicide sorties.
10. It is the substantial body of work constituting the life work of a writer, a musician or an artist.

# మీ పిల్లల్ని ఎంతవరకు అర్థం చేసుకొన్నారు ?

– 'మిసిఫి' వర్క్ షాప్

పిల్లలు తలిదండ్రుల నుంచి, వారి ద్వారా, వారి గుండా వచ్చిన మాట నిజమే, కాని వారు కేవలం తమ అంశాలు, తమ భాగాలు మాత్రమే కాదని ఎంతమంది తల్లిదండ్రులు గుర్తించగలరు? పిల్లలు తలిదండ్రుల కంటే ఎంతో భిన్నమైన వారు. తల్లి దండ్రులు పుట్టి పెరిగిన పరిసరాలు వేరు. వారి పిల్లలు పుట్టి పెరుగుతున్న పరిసరాలు ఎంతో భిన్నమైనవి. ఈ మౌలిక విషయాలను విస్మరించి తలిదండ్రులు పిల్లలను తమకు నమూనాలుగా పెంచా లనుకొంటారు. తమకు వారసులుగా, తమ కోర్కెల కనుగుణంగా తయారు చేయా లనుకొంటారు. ప్రతి తల్లితండ్రి, దాదాపుగా అందరూ తమ పిల్లలను డాక్టర్లుగానో, ఇంజనీర్లుగానో తయారు చేయాలని, ఎమ్‌సెట్ పరీక్షలకూ పిల్లల్ని రాచి రంపాన పెట్టి తదనుగుణంగా వారిని సాగదీసి, పుటం పెట్టి వేపుకు తింటున్న సంగతి మనం నేడు చూస్తూనే ఉన్నాం. పిల్లల అభిరుచులకు ఏ మాత్రం విలువ నివ్వని సంగతి గమనిస్తున్నాం.

మరి కొంత మంది తలిదండ్రులు, తమకు తెలియకనే తమ వ్యాకులతలను పిల్లలపై రుద్దుతున్నారు. పిల్లలు నూతన అనుభవాల కోసం వెంపర్లాడుతారు. ఆ దిశలో తమ పరిసరాన్ని అన్వేషించి, తమకు తాము ఆ పరిసరాన్ని జీర్ణించు కొంటారు. ఈ అన్వేషణలో తలిదండ్రులు తమ పిల్లలకు పూర్తి స్వేచ్ఛనిచ్చి, దూరం నుంచి చూస్తూ మార్గ నిర్దేశకులుగా ఉండాలి. అలా ఉండక, ఆ పిల్లవాడు ఆ అన్వేషణలో ఏమౌతాడో నని తల్లి విలవిల లాడి పోతుంది. ఫలితంగా పిల్లలను ఏ పనీ చేయనీయరు. పదేళ్ళు దాటినా పిల్లలకు బట్టలు తామే వేస్తారు. అన్నం తామే కలిపి పెడతారు. ఇలాటి తల్లిదండ్రులను అతి రక్షక తలిదండ్రులు (Over Protective) అంటారు. ఇలాంటి తల్లిదండ్రులు పిల్లలకు మెత్తగా, నెమ్మదిగా హేతుబద్ధంగా, సౌమ్యంగా చెప్పలేరు. తీవ్ర స్వరంతో, వేదనతో, కొట్టినట్లుగానే చెబుతారు. దీనికి కారణం వారి అంతర్గత వ్యాకులత. దాని నంతా ఆ విధంగా పిల్లల మీద గుమ్మరిస్తుంటారు. అలాంటి పిల్లలు సాఫీగా కుంటుపడకుండా, ఎదుగలేరు.

పిల్లల కోరికలు వేరు. పెద్దల ఆశలు, ఆశంసలు వేరు. అందుకని తల్లిదండ్రులు ఎప్పుడూ తమ పిల్లలను నూటికి నూరు పాళ్ళు అర్థం చేసుకోలేరు. ఆ మాట కొస్తే అసలు ఏ మనిషీ ఏ మనిషిని పూర్తిగా అర్థం చేసుకోలేడు. అది వేరే సంగతి.

నిజంగా తల్లిదండ్రులు పిల్లలకు ఎంత స్వేచ్ఛ నిస్తున్నారు? తల్లిదండ్రుల ఆశలకు, ఆశంసలకు అనుగుణంగా కాక, పిల్లల సహజ స్వభావానికి అనుగుణంగా ఎదగడానికి వారిని ఏ మేర తల్లిదండ్రులు అనుమతిస్తున్నారు? అంటే తల్లిదండ్రులు తమ పిల్లలను ఏ మేరకు అర్థం చేసుకోగలుగుతున్నారు? దీనికి సమాధానం కోసం ఈ ప్రశ్నావళికి మీ సమాధానాలు చెప్పుకొని పరిశీలించండి.

1) మీరు అనుమతించిన సమయం కంటె మీ పిల్లలు దూరదర్శన్ చూస్తుంటే -
   ఎ) దూర దర్శన్ సెట్‌నే ఇంటిలో నుంచి తీసివేస్తారా?
   బి) వీక్షించే సమయాన్ని ఖచ్చితంగా అమలు చేస్తారా?
   సి) అంతగా టి.వి. చూస్తా రెందుకని వారితో చర్చిస్తారా?

2) డిగ్రీ అనంతర (విశ్వవిద్యాలయ స్థాయి) చదువులు మీ పిల్లలు చదివి తీరాలని ముందే నిర్ణయించారా?
ఎ) సహజంగానే
బి) వారి గురువుల సలహాల కోసం అగుతారా
సి) వారు ఇష్టపడితేనే
డి) వారి మీద డబ్బును దండగ చేయరు.

3) పండుగ బహుమతులు, పుట్టిన రోజు బహుమతులు కొనే ముందు నిజంగా వారికి ఏవి ఇష్టమో తెలుసుకొంటారా?
ఎ) అప్పుడప్పుడు
బి) వారికి డబ్బు ఇచ్చేస్తాను
సి) ప్రతిసారి
డి) ఏమైనా వారికి ఏవి కావాలో వారికి తెలియదు.

4) మీ పుత్రుడు ఆడంగి లక్షణాలు ప్రదర్శిస్తే ఖిన్ను లవుతారా!
ఎ) అవును
బి) నిజంగా కాను
సి) అలా జరిగే వీలులేదు
డి) నా దుస్తులు అతనికి ఇస్తాను.

5) మీ అమ్మాయి మగరాయుని లక్షణాలు ప్రదర్శిస్తే ఖిన్ను లవుతారా?
ఎ) అవును
బి) నిజంగా కాను
సి) అలా జరిగే వీలు లేదు
డి) నా పంట్లాములు ఆమెకు ఇస్తాను.

6) మీ కొడుకుగాని, కూతురుగాని మొదటి సారి ప్రేమలో పడినప్పుడు
ఎ) దానికి సంబంధించిన పూర్తి విషయమంతా తెలుసుకోవా లనుకొంటారా?
బి) అది వారి వ్యక్తి గత విషయమని వదిలివేస్తారా?
సి) కడుపును గురించి వ్యాకులత చెందుతారా?
డి) అది అసలు జరుగనట్లే ప్రవర్తిస్తారా?

7) మీ బిడ్డ మిమ్మల్ని విమర్శిస్తే మాటలతో దాడి చేస్తే మీరేం చేస్తారు.
ఎ) కుతూహలం కనపరుస్తారా!
బి) ద్వేషాన్ని ప్రదర్శిస్తారా?
సి) నవ్వేస్తారా?
డి) నమ్మ శక్యం కానట్లు చూస్తారా?

8) మీ బిడ్డ చిత్రాన్ని గీయ వలసి వస్తే, ఆబిడ్డను - ఎలా చూపుతారు ?
ఎ) నవ్వుతున్నట్లు
బి) ఇరకాటంలో పడ్డట్లు
సి) గర్విస్తున్నట్లు
డి) ఇవేవీ కానట్లు

9) చిల్లర ఖర్చులకు మీ బిడ్డకు డబ్బుల్ని ఇవ్వా లనుకొంటారా?
ఎ) ఒక హక్కుగా
బి) ఒక విధిగా
సి) ఒక బహుమతిగా
డి) ఎప్పుడు ఇవ్వ కూడదు

10) మీ బిడ్డ జీవితంలో ముఖ్యమైనది ఏది?
ఎ) మీకు మనుమడిని కని ఇవ్వడమా?
బి) సుఖ సంతోషాలతో ఉండడమా?
సి) డబ్బు బాగా సంపాదించడమా?
డి) చెప్పింది చెప్పినట్లు ఖచ్చితంగా చేయడమా?

11) మీ వృద్ధాప్యంలో మీ బిడ్డ
ఎ) మిమ్మల్ని ప్రతిరోజు దర్శించాలా ?
బి) క్రమం తప్పక మీతో సంబంధం నెరపాలా?
సి) అప్పు డప్పుడు కలుసుకొంటే చాలా?
డి) మీ పుట్టిన రోజును గుర్తు పెట్టుకోవాలా?

12) మీ పిల్లల లోపాలకు ఏది కారణం ?
ఎ) మీ భర్త తప్పిదాలు బి) మీ అత్తగారి దోషాలు
సి) అవి క్షమించదగినవే డి) ఏ తప్పులు ?

13) పెద్ద వాళ్లు తమ బిడ్డల నుంచి ఏమైనా నేర్చుకొనగలరా?
ఎ) ఎప్పుడూ నేర్చుకోలేరు. బి) ఎప్పుడూ నేర్చుకోవచ్చు
సి) కొన్నిసార్లు నేర్చుకోవచ్చు! డి) దాని మీద వాళ్ళు పని చేసినప్పుడం మాత్రమేనా?

14) మీ బిడ్డ పెంపుడు జంతువును కావాలని కోరితే మీరేమంటారు?
ఎ) దాని పని నీఅంత నీవు చూసు కోగలగి నంత కాలం
బి) అది నీవు కోరిన జంతువే అయినంత కాలం
సి) అలాగే నా ముద్దుల బిడ్డా
డి) దాని సంగతి మరిచిపో !

15) నీ బిడ్డకు నీవు పెట్టాలను కొనే పేరు
ఎ) బిడ్డకు ఇబ్బంది కరంగా ఉంటుంది.
బి) అందరికీ గర్వకారణమైంది.
సి) ఎన్నడూ చర్చించనిది.
డి) ఎ సమస్యా లేదు, ఎందుకంటే నీవు ఎప్పుడూ ఎగతాళి పేర్లు పెడుతూనే ఉంటావు.

## గణన

| | a | b | c | d |
|---|---|---|---|---|
| 1) | 1 | 3 | 4 | 5 |
| 2) | 3 | 4 | 5 | 1 |
| 3) | 4 | 5 | 3 | 1 |
| 4) | 4 | 5 | 3 | 1 |
| 5) | 3 | 5 | 4 | 1 |
| 6) | 5 | 4 | 3 | 1 |
| 7) | 5 | 4 | 3 | 1 |
| 8) | 4 | 5 | 3 | 1 |
| 9) | 5 | 3 | 3 | 1 |
| 10) | 3 | 5 | 4 | 1 |
| 11) | 1 | 3 | 4 | 5 |
| 12) | 2 | 2 | 5 | 1 |
| 13) | 1 | 3 | 4 | 5 |
| 14) | 5 | 2 | 3 | 1 |
| 15) | 3 | 4 | 1 | 5 |

## విలువ

**75-63** మీరు మంచి తల్లిదండ్రులు. మీ అంత మంచి తల్లిదండ్రులు కావడం వారి అదృష్టం అని వారికి తెలియదు.

మీరు చేసే త్యాగం, పోషణ, మార్గ నిర్దేశకత్వాలతో, వారు తమ వైయక్తిక మూర్తిమత్వాలను పండించుకొనే అవకాశం ఉంది.

**62-45** మంచిగా ప్రయత్నిస్తారు. మంచి తల్లిదండ్రులు. కొన్ని సార్లు మీ బిడ్డ తాదాత్మ్యం (Identity) మీతో కలిసి పోతుంది (ముఖ్యం మీ లింగం గూడా అదే అయితే). మీ పైతృక పరిసరానికి మీరు బందీలు. కాని మీ బిడ్డను స్వేచ్ఛగా వదలాలంటే ఆ శక్తి మీకుంది.

**44-32** వదిలి పెట్టడానికి ప్రయత్నించండి. మీబిడ్డ ఇల్లు విడిచి పోతే తప్ప, వాని స్వీయ తాదాత్మ్యం (Self Identity)పొందే అవకాశం పూర్తిగా కుంటుపడుతుంది. అంటే దీని అర్థం మీ బిడ్డ మీ కొంగుకు అంతగా అంటుకు పోయిందన్న మాట.

**31-15** అపరాధ భావనతో గూడిన తల్లిదండ్రులు మీరు. మీ బిడ్డలో చూసే దోషాలన్నీ మీవే కాక పోతే వాటిని భూతద్దంలో చూస్తారు. మీ అభద్రతా ప్రతిమానుగుణంగా తయారైన సాధు జీవులు మీ బిడ్డలు. ఫలితం మీకు పూర్తి తృప్తి లేనట్లయితే, ఎవరిని నిందించాలో మాకు తెలుసు ? కాదా ?



మహాజనక జాతకం

MISIMI/ మిసిమి RNI Regd. No. 45042/90 Telugu Monthly, Hyderabad - 500 020. Postal Regd. No. H/SD/191



పశ్చాత్తప్త మగ్దలీన్ (మొగల్ శైలి 1600-1603)